# Don't you owe the















# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'   సంచాలకుడు : నాగిరెడ్డి

## ప్రావీణ్యతే దైవం!

"దేవుడు మనిషిని తన ప్రతిరూపంగా రూపొందించాడు!'' అని మత గ్రంథాలు చెబుతున్నాయి. దైవసృష్టిలో సర్వోత్కృష్టమైనది. సర్వోత్తమమైనది మానవజన్మ అని ఎందరో తత్త్వవేత్తలు. మేధావులు. శాస్త్రవేత్తలు చెప్పారు. మన శరీరాన్ని. అందులోని ఒక్కొక్క అంగం పని చేసే తీరునూ పరిశీలించినట్టయితే. అవి ఎంత నిర్దుష్టంగా రూపొందించబడ్డాయో మనకు ఆశ్చర్యం కలిగిస్తుంది. మనిషి మెదడు పని చేసే విధానం మరీ అద్భుతమైనది!

మనిషి తనలాగే పరిపూర్ణుడుగా ఉండాలన్నదే దైవసంకల్పం. ఇలా ఆలోచించే కాబోలు ఇటీవల బొంబాయికి చెందిన ఒక సుప్రసిద్ధ పాత్రికేయుడు. పార్సీయువకులను ఉద్దేశించి ఉపన్యసిస్తూ. ''ప్రావీణ్యతే పరమాత్మస్వరూపం. ప్రావీణ్యత. పరిపూర్ణత ఉన్నచోటే పరమేశ్వరుడు కొలువుంటాడు. సర్వోత్కృష్టతను సాధించడం ద్వారానే మనం మనలోని దేవుణ్ణి కనుగొనవచ్చు!'' అని అన్నాడు.

ప్రావీణ్యతను సాధించాలన్న ప్రయత్నం బాల్యం నుంచే ప్రారంభమవుతుంది. తల్లిదండ్రుల నుంచి మొదలై. ఉపాధ్యాయుల ద్వారా. చదివే పుస్తకాల ద్వారా. బంధుమిత్రుల ద్వారా ఇది జీవితాంతం కొనసాగుతుంది. తొలినుంచే మంచి భావాలు. మంచి ఆలోచనలు కలిగి వుండడం. మంచి మాటలు నేర్చుకోవడం మంచి పనులుగా రూపొంది. ప్రావీణ్యతకూ. సర్వోత్కృష్టతకూ దారి చూపుతాయి.

అయితే. ప్రావీణ్యతకు ఒక హద్దు అంటూ వుండదు. ఉదాహరణకు ప్రముఖ పోల్‌వాల్ట్ క్రీడాకారుడు సెర్గీ బుబ్కాను తీసుకుందాం. ప్రతి ఒక్కసారీ. అతడు తన రికార్డును తానే అధిగమించడానికి ప్రయత్నించి విజయం సాధిస్తున్నాడు. అయినా. అందులో తృప్తికలగడం లేదనీ. ఇంకా ఎంతో సాధించాలనీ అంటున్నాడు. ప్రతి మనిషికి అలాంటి ఉత్సాహమే కావాలి. సాధించినవాటితో తృప్తి చెందకూడదు. స్వామి వివేకానంద ప్రబోధించినట్టు 'నిరంతరకృషి' అవసరం. ఎందుకంటే ప్రయత్నమే ప్రావీణ్యతకు పునాది వంటిది!

సంపుటి 90   మార్చి '92   సంచిక 3

విడి ప్రతి : 4-00   : :   సంవత్సర చందా : 48-00





CHITRA

**వార్తలు-విశేషాలు:**






# మరొక కామన్వెల్త్

డిసెంబర్ నెల మొదటి మూడు వారాలలో మన వార్తాపత్రికలు—'సోవియట్ యూనియన్ పతనం', 'యు. ఎస్. ఎస్. ఆర్. విచ్ఛిత్తి' 'కమ్యూనిజం అంతం' మొదలైన పతాక శీర్షికలతో వెలువడ్డాయి. నాటి సోవియట్ యూనియన్‌లో అమితవేగంతో వచ్చిన మార్పులను ఆ శీర్షికలు వివరించాయి. ఇప్పుడు సోవియట్ యూనియన్ అనేక స్వతంత్ర దేశాలుగా విడిపోయి, నాటి సోవియట్ యూనియన్ స్థానంలో 'కామన్వెల్త్ ఆఫ్ ఇండిపెండెంట్ స్టేట్స్' (సి. ఐ. ఎస్.) ఏర్పడింది!

ఒకప్పుడు సూర్యుడస్తమించని సువిశాల సామ్రాజ్యంగా పేరు గాంచిన బ్రిటిష్ పాలనలో గడిపిన దేశాలు స్వాతంత్ర్యానంతరం 'కామన్వెల్త్' దేశాలుగా ఏర్పడ్డాయి. ఇండియా, పాకిస్తాన్, శ్రీలంక, సింగపూర్, ఆస్ట్రేలియా, కెనడా మొదలైన దాదాపు నలభైకి పైబడిన దేశాలు 'కామన్వెల్త్' దేశాలుగా ఏర్పడ్డాయి!

ఈనాడు నిన్నటి సోవియట్ రష్యాలోని పన్నెండు దేశాలు కలిసి మరొక కొత్త 'కామన్వెల్త్'ను ఏర్పాటు చేసుకున్నాయి.

1917వ సం॥లో అక్టోబర్ విప్లవం ద్వారా, లెనిన్—ట్రాట్‌స్కీ నాయకత్వంలో ప్రజలు, జార్ నిరంకుశ పరిపాలనను అంతం చేయడంతో యూనియన్ ఆఫ్ సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్స్ (యు.ఎస్.ఎస్.ఆర్.)ఆవిర్భవించింది. శ్రామిక వర్గం అధికారం చేపట్టిన కమ్యూనిస్టు పరిపాలన అమలులోకి వచ్చింది. ప్రపంచ చరిత్ర కొత్త మలుపు తిరిగింది.

డెబ్భైనాలుగు సంవత్సరాలు జరిగాక, గత సంవత్సరం, సోవియట్ రష్యా నుంచి బాల్టిక్ రిపబ్లిక్ రాష్ట్రాలయిన ఎస్తోనియా, లాట్వియా, లిథువేనియా విడిపోవాలని కోరడంతో సోవియట్ రష్యాలో పలుప్రాంతాలలో అలజడులు ప్రారంభమయ్యాయి.

సోవియట్ ప్రెసిడెంట్ గోర్బచేవ్ మిగతా పన్నెండు రాష్ట్రాలు అంగీకరించగలవన్న నమ్మకంతో నూతన సమైక్య ఒడంబడికను రూపొందించాడు. అయితే, చాలా రాష్ట్రాలు స్వతంత్ర దేశాలుగా విడిపోవాలని నిర్ణయించడంతో, అవి నూతన ఒడంబడికలో సంతకాలు చేయడానికి గోర్బచేవ్ ఏర్పాటు చేసిన సమావేశానికి కూడా హాజరుకాలేదు.

గోర్బచేవ్ అధ్యక్షపదవికి రాజీనామా చేసి, 'రష్యన్ ఫెడరేషన్' అధ్యక్షుడయిన బోరిస్ ఎలిత్సిన్‌కు అధికారం అప్పగించాడు. బోరిస్ ఎలిత్సిన్ డిసెంబర్ ఏడవతేదీ, గోర్బచేవ్ నూతన ఒడంబడికలో సూచించిన 'కన్‌ఫెడరేషన్'కు వ్యతిరేకంగా 'కమ్యూనిటీ'ని ఏర్పాటు చేయాలన్న అభిప్రాయం వెలిబుచ్చాడు. ఆఖరికి, రిపబ్లిక్కులన్నిటికీ స్వతంత్ర ప్రతిపత్తిని అంగీకరించే 'కామన్వెల్త్', అమలులోకి వచ్చింది.

అయితే, ఈ కామన్వెల్త్ కూడా సాఫీగా సాగుతుందని చెప్పలేము. ఎందుకంటే, ఈ దేశాలు అనుసరించవలసిన ఉమ్మడి ఆర్థిక విధానం, 'కామన్‌కరెన్సీ', రక్షణ ఏర్పాట్లు, అణ్వాయుధాలపై అధికారం మొదలైన సమస్యలెన్నిటినో పరిష్కరించుకోవలసి ఉన్నది.

1917వ సం॥లో జరిగిన రష్యా విప్లవం ఇరవైయవ శతాబ్ద చరిత్రలో ఒక మైలురాయిగా నిలిచింది. ఇప్పుడు రష్యాలో వస్తూన్న అనూహ్యకరమైన మార్పులు, ఎలాంటి పరిణామాలకు దారి తీయగలవో అని ప్రపంచం పరిశీలిస్తున్నది!



# అసలైనతల్లి

రామనాథపల్లెలో వుండే శేషయ్య, లక్ష్మి దంపతులకు, మాధవుడొక్కడే సంతానం. అయితే, లక్ష్మి చెల్లెలు ఆడపిల్లను కని చనిపోవడంతో, మరిది అనుమతితో లక్ష్మి ఆ పిల్లను కూడా తెచ్చుకుని, కన్నబిడ్డలా పెంచింది. శేషయ్య కూడా పరాయిబిడ్డ అన్న తేడా ఏమాత్రం చూపించక కన్న తండ్రిలాగే ఆ పిల్లను ఎంతో ఆప్యాయంతో ఆదరించాడు.

ఆ పిల్ల పేరు మల్లిక. మల్లిక పెద్దదవుతున్నకొద్దీ, ఆ పిల్ల మూలంగా లక్ష్మికీ, శేషయ్యకూ మధ్య చిన్నచిన్న తగాదాలు రాసాగాయి. తల్లి లేని పిల్ల అన్న జాలి కొద్దీ లక్ష్మి, మల్లిక ఆడింది ఆటగా, పాడింది పాటగా చూసేది. ఈరకమైన పెంపకంవల్ల, మల్లికలో మొండితనం, అహంకారం నానాటికీ పెచ్చు పెరిగిపోసాగాయి. మల్లికను ఎంత గారాబం చేసినా, ఈ విషయంలో మాత్రం శేషయ్య, భార్యను తీవ్రంగా మందలించేవాడు.

కాని లక్ష్మి మాత్రం అదేం పట్టించుకోకపోగా, కోపం తెచ్చుకుని, ''అవునులెండి, మీబిడ్డఅయితేమీరిలామాట్లాడేవారుకాదు. ఏదో ఉద్ధరిద్దామని దాన్ని తీసుకొచ్చాను. ఇంతకంటే ఏ అడవిలో పారేసినా బాగుండేది!'' అని సమాధానం ఇచ్చేది.

ఇలాగే రోజులు గడిచి, మల్లిక యుక్తవయస్కురాలైంది. శేషయ్య ఆమెకు సంబంధాలు చూడడం ప్రారంభించాడు. అయితే, మల్లిక పెడసరపు బుద్ధివల్ల కొంతా, లక్ష్మికీ, మల్లికకూ ఏ పెళ్ళికొడుకూ నచ్చకపోవడంవల్ల కొంతా మల్లిక పెళ్ళి కుదరడం కష్టమైంది.

చివరకు, అదే పల్లెలో నాలుగు వీధులకు అవతల వుంటున్న గిరిధారి అనే కుర్రవాడితో మల్లిక పెళ్ళి నిశ్చయమైంది.

లలిత గాయత్రి



ఏ కళనుండోగాని మల్లిక పెళ్ళిచూపుల్లో, మగపెళ్ళివారడిగిన ప్రశ్నలకు సౌమ్యంగానే జవాబులిచ్చింది.

ఆ సంబంధం కుదరగానే లక్ష్మి, భర్తతో, "చూశారా! ఇన్నాళ్ళూ మల్లిక పంతగొండీ, అహంకారీ అంటూ మాట్లాడారు. పెళ్ళి చూపుల్లో ఎంత కుదురుగా ప్రవర్తించిందో చూడండి!" అన్నది.

భార్య మాటలకు శేషయ్య నవ్వి వూరుకున్నాడు.

రెండు రోజులు గడిచాక, ఒక రోజు శేషయ్య, భార్యతో, "మల్లిక పెళ్ళి కుదిరింది గదా! పనిలో పనిగా మాధవుడి కూడా చేసేస్తే బావుంటుంది," అన్నాడు.

"మాధవుడి పెళ్ళికి అంత తొందరేమొచ్చింది?" అన్నది లక్ష్మి.

"అదికాదు. నారాయణ తన కూతురు కమలను, మాధవుడికి చేసుకోమని ప్రాధేయపడుతున్నాడు," అంటూ అసలు విషయం బైటపెట్టాడు శేషయ్య.

నారాయణ, శేషయ్యకు చిన్ననాటి నుంచి స్నేహితుడు. అతడి కుటుంబమంతా లక్ష్మికి తెలుసు. నారాయణ కొడుకు వేణు, మాధవుడూ మంచి స్నేహితులు.

"అదేమిటి? ఆ పిల్లకు మేనరికం వుంది కదా!" అన్నది లక్ష్మి.

"ఆ సంబంధం చెడిపోయిన సంగతి, నీకూ తెలుసు గదా!" అన్నాడు శేషయ్య విసుగ్గా.

"ఆఁ! ఆ పిల్ల నోటి దురుసుతనం వల్లే, ఆ సంబంధం చెడిపోయిందన్న సంగతి కూడా నాకు తెలుసు!" అన్నది లక్ష్మి వెటకారంగా.

లక్ష్మి మాటలకు శేషయ్యతో బాటు, అక్కడే వున్న మాధవుడు కూడా ఆశ్చర్యపోయి, "అదేమిటమ్మా, కమలను చిన్నతనం నుంచి ఎరిగిన నువ్వేనా, ఇలా అంటున్నది?" అనేశాడు.

అది విని లక్ష్మి, కొడుకు కేసి తీవ్రంగా చూసింది. అప్పుడు మాధవుడు శాంతంగా,

"అమ్మా, కమల విషయంలో నువ్వు చాలా పొరబాటు పడుతున్నావు. చిన్న తనం నుంచీ తనను కోడల్ని చేసుకుంటా నని చెబుతున్న కమల మేనత్త, తీరా సమయం వచ్చేసరికి కట్నకానుకలంటూ గొంతెమ్మకోరికలు కోరింది. ఇది తెలిసిన కమల, మేనత్త సంబంధం తాను ససేమిరా చేసుకోనని ఖచ్చితంగా చెప్పింది. అసలు విషయం ఇది. ఇప్పటికీ కమలదే తప్పంటావా?" అని అడిగాడు.

"పెద్దవాళ్ళ విషయాల్లో తల దూర్చి, తగుదునమ్మా అంటూ మాట్లాడే పిల్ల, రేపు అత్తమామల్ని బైటికి నడవమని కూడా అంత ఖచ్చితంగానే చెబుతుంది! సరే, మీరు ముందే ఒక నిశ్చయానికి వచ్చాక, నా ప్రమేయం ఎందుకు?" అంటూ లక్ష్మి అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

చివరకు మాధవుడి ఇష్టప్రకారమే, మల్లిక అత్తవారింటికి వెళ్ళిన కొద్ది రోజులకే, కమల అతడి భార్యగా ఆ ఇంట అడుగుపెట్టింది. అయితే, ఆ దినుంచీ కమలపట్ల సదభిప్రాయం లేని లక్ష్మి, కమల వచ్చిన నాటినుంచీ, ఆమెను సాధించడమే పనిగా పెట్టుకున్నది. అయినా, తను ఎంత నిరసనగా ప్రవర్తించినప్పటికీ చెక్కుచెదరకుండా ఎంతో సరళంగా ప్రవర్తించే కమలను చూస్తే, ఒక్కొక్కసారి లక్ష్మికే ఆశ్చర్యంగా వుండేది.





ఇలా వుండగా—ఒక రోజు మల్లిక ఇంటికి చుట్టంచూపుగా వెళ్ళిన కమల, మాధవుడు వెళ్ళిన కొద్దిసేపటికే తిరిగి వచ్చేశారు. వాళ్ళతోబాటు మల్లిక, గిరిధారి కూడా వున్నారు. కమల తలకు కట్టుకట్టి వున్నది.

ఇదంతా చూసిన శేషయ్య ఆతృతగా, "ఏమిటమ్మా, కమలా! తలకు ఏమైంది?" అని అడిగాడు.

జవాబుగా గిరిధారి ముందుకువచ్చి, "ఆ ప్రశ్న కమలను కాక, మీ అమ్మాయిని అడిగితే బావుంటుంది, మామయ్యా గారూ!" అని, అత్త లక్ష్మికేసి నిరసనగా చూస్తూ, "మీ గారాలకూతురి ఘనకార్యం ఇది! పెళ్ళయి మా ఇంటికి వచ్చిన నాటినుంచీ, మల్లిక పెడసరపు స్వభావాన్నీ, అహంకారాన్నీ మేం అందరం ఎంతో సహనంగా భరిస్తున్నాం. కాని, ఈ రోజు ఏదో మాటకు కోపం వచ్చి, పక్కనే చేతికందిన చెంబు తీసి విసిరేసింది. అది మా అమ్మకు తగలవలసింది. కాని, సమయానికి కమల చప్పున అడ్డం వెళ్ళి, ఆ దెబ్బ తను తిన్నది!" అన్నాడు.

లక్ష్మి చప్పున మల్లిక వైపు చూసింది. అప్పటిదాకా బెదురుగా దిక్కులు చూస్తున్న మల్లిక, ఒక్కసారిగా తల్లిని చుట్టుకుపోయి ఏడవసాగింది. కాని, ఎప్పటిలా కూతుర్ని ఓదార్చలేకపోయింది లక్ష్మి.

గిరిధారి కొద్దిసేపు ఆగి, "ఇక పద!" అంటూ మల్లికను తీసుకుని ఇంటికి వెళ్ళిపోయాడు.

అల్లుడు చెప్పింది విన్న లక్ష్మిలో అంతర్మథనం ప్రారంభమైంది. ఏమీ తోచనిదానిలా అటూ ఇటూ కాసేపు తిరిగి, హరికథాకాలక్షేపం కోసం గుడికి వెళుతున్న భర్తతోబాటు బైలుదేరింది.

హరిదాసు కథా కాలక్షేపం ప్రారంభించి, అడవులకు వెళ్ళిపోయిన సీతారాములకోసం, కౌసల్యాదేవి పడుతున్న ఆవేదనను వర్ణించి చెప్పసాగాడు:

"స్త్రీ సహజంగా కరుణామూర్తి. అంతటి కరుణామూర్తి అయిన స్త్రీలో రెండు రకాల ప్రవర్తనలను మనం తరచు చూస్తూంటాం. ఒకే స్త్రీ తల్లిగా సహనశీలగానూ, అత్యంత ప్రేమ మూర్తిగానూ; అత్తగారిగా పూర్తి విరుద్ధమైన స్వభావంతోనూ ప్రవర్తిస్తుంది. తన కూతురు ఎంత చెడ్డదైనా ప్రేమతో ఆదరించే స్త్రీ, తన కోడలు ఎంత మంచిదైనా, ఆమెలో ఏవో లోపాలు ఎంచుతూనే వుంటుంది. అసలు నిజం చెప్పాలంటే, కూతుర్నీ, కోడల్నీ సమానంగా చూసే స్త్రీయే అసలైన తల్లి. అలా కాక కూతురుపట్ల ఒక రకంగా, కోడలిపట్ల మరొకరకంగా ప్రవర్తించే స్త్రీ, ఎంతమంది పిల్లలున్నా గొడ్రాలి కిందే లెక్క!" అంటూ హరికథలో భాగంగా నీతిబోధ చేసిన హరిదాసు తిరిగి అసలు కథ చెప్పసాగాడు.

అయితే, ఇది విన్న లక్ష్మి మనసు మాత్రం, హరిదాసు నీతిబోధ మీదే నిలిచిపోయింది.

హరికథ పూర్తయ్యాక లక్ష్మి, శేషయ్యా ఇంటికి బయలుదేరారు. దారిలో శేషయ్య హఠాత్తుగా, "లక్ష్మి! ఇంతకు ముందు హరిదాసు చెప్పినట్టు చూస్తే, నువ్వు పిల్లలున్న గొడ్రాలివేనే!" అన్నాడు.

భర్త మాటలకు లక్ష్మికి దుఃఖం ఆగలేదు. ఆమె కొంగుతో కన్నీళ్ళు తుడుచుకుంటూ, "ఈ రోజుదాకా నేను అటువంటిదాన్నే నన్న విషయం ఒప్పుకుంటున్నానండీ! ఇప్పుడు, నా కళ్ళ పొరలు తొలగిపోయాయి. కమల వంటి కోడలు దొరకడం ఎంత అదృష్టమో, గ్రహించాను. మల్లికను తల్లి లేని పిల్ల అని అతిగా ముద్దు చేశాను. కాని, ప్రతి కోడలూ తల్లికి దూరమై, మాతృప్రేమకోసం అల్లాడే మనిషే! కమలను, మల్లికను సమానంగా చూసిననాడే, నేను తల్లినైనట్టు." అన్నది.

భార్యలో వచ్చిన మార్పుకు ఆనందించిన శేషయ్య, "అలాగని చెప్పి కమలను కూడా, మల్లికను పాడుచేసినట్టు చేసేవు సుమా!" అన్నాడు నవ్వుతూ.



# వైద్యంలో తొందరపాటు

వైద్యుడు రుద్రాచారిదగ్గిర, శరభాచారి అనే యువకుడు, వైద్యం నేర్చుకోవడానికి చేరాడు. రుద్రాచారి రకరకాల రోగాలూ, వాటికి రకరకాల మందులూ గురించి చెబుతూంటే, శరభాచారి పుస్తకంలో రాసుకునేవాడు.

ఒకసారి రుద్రాచారి వాడితో, "కొన్ని కొన్ని వ్యాధులకు మందులు లేవు. ఉదాహరణకు– ఎక్కిళ్ళు! ఆగకుండా ఎక్కిళ్ళు వస్తుంటే, అవి ఆగడానికి చెంపఛెళ్ళుమనిపించడమే మందు," అన్నాడు.

ఇంతలో గుర్రపుబండి దిగిన ఒక లావుపాటి వ్యక్తి, రుద్రాచారి దగ్గిరకు వచ్చి, "అయ్యా, నిన్న రాత్రినుంచి ఎక్కిళ్ళు ఆగడంలేదు..." అంటూ ఇంకా చెబుతూండగానే, శరభాచారి అతడి చెంప ఛెళ్ళుమనిపించి, "ఇక మీ ఎక్కిళ్ళు ఆగిపోతాయి, చూడండి!" అన్నాడు సంతోషం పట్టలేక.

లావుపాటి వ్యక్తి బాధ కొద్దీ చెంప పట్టుకుని, "అయ్యో! ఎక్కిళ్ళు నాకు కాదండీ, అదిగో ఆ బండిలో వున్న, మా అన్నయ్యకు!" అన్నాడు.

రుద్రాచారి కోపంగా శరభాచారికేసి చూశాడు. వైద్యంలో తొందరపాటు కూడదని శరభాచారికి తెలిసి వచ్చింది.

—ఎం. డి. సౌజన్య






## 13

[రుద్రపురి యువరాణి కంఠహారంలోని చంద్రకాంతమణిని అపహరించాలని మంత్రీ, మాంత్రికుడూ పథకం వేశారు. యువరాణిని ప్రాణంతో తనకు అప్పగించమని మంత్రగత్తె మాంత్రికుణ్ణి ఆజ్ఞాపించింది. దుర్గామాత ఆలయంలోని సొరంగ మార్గం గుండా యువరాణిని తీసుకువెళ్ళాలని మాంత్రికుడు, పథకం వేశాడు: ఆ సంగతి అపూర్వుడు తెలుసుకున్నాడు. —తరవాత]

యువరాణి జన్మదినం సమీపిస్తున్నది. మంత్రీ, మాంత్రికుల దుష్టపథకం గురించి రాజు విశ్వవర్మకు తెలియజేయాలని, అపూర్వుడు సమీరుడి దగ్గరకు వెళ్ళాడు.

అంతదూరంలో అపూర్వుణ్ణి చూస్తూనే అమితానందం చెందిన సమీరుడు, అతడు చెప్పిన సంగతి విని, దానిని రాజుకు తెలియజేయడానికి రాజధానికి బయలు దేరాడు.

అది మరొక కాళరాత్రి సమయం. మాంత్రికుడు వీరవికటుడు రహస్యంగా వెళ్ళి ప్రధానమంత్రి భవనం తలుపు తట్టాడు. భవనం నుంచి వెలుపలికి వచ్చిన మంత్రి, ''అపరాత్రివేళ వచ్చావేమిటి?'' అని అడిగాడు ఆశ్చర్యంగా.

''అపరాత్రివేళ కాకపోతే, నేనెప్పుడైనా పట్టపగలు నిన్ను చూడడానికి వచ్చానా?'' అన్నాడు వీరవికటుడు వెటకారంగా.



"అలా అని కాదు. ఏదైనా అవాంతరం ఏర్పడి, ముఖ్యమైన కార్యంమీద వచ్చావేమో అని అడిగాను," అన్నాడు మంత్రి.

"అవును. చాలా ముఖ్యమైన కార్యం మీదే వచ్చాను. మన పథకం ఎలాగో మూడోవ్యక్తికి తెలిసిపోయిందని మంత్రగత్తె భావిస్తున్నది. మన మీద ఎవరో నిఘావేసి ఉన్నారు!" అన్నాడు వీర వికటుడు కనుబొమలు ఎగురవేస్తూ.

"అది అసంభవం!" అన్నాడు ప్రధాన మంత్రి.

"మంత్రగత్తె మనసులో అటువంటి అనుమానం కలిగిందంటే, అందులో తప్పకుండా నిజం వుండి తీరుతుంది. మవ్వీ విషయం నీ భార్యకుగానీ, మిత్రులకుగానీ చెప్పావా?" అని అడిగాడు మాంత్రికుడు.

"లేదు. మన చిన్ననాటి స్నేహంమీద ప్రమాణం చేసి చెబుతున్నాను!" అన్నాడు ప్రధానమంత్రి దృఢస్వరంతో.

"నిన్ను నమ్ముతున్నాను! అయినా, మన పథకం జయప్రదం కావాలంటే మనం మరింత జాగ్రత్త వహించాలి. విశ్వాసపాత్రులయిన నీ భటులను, రాజభవనం చుట్టూ కాపలావుంచు. కాపలా రాత్రింబవళ్ళు కొనసాగాలి. కొత్త వాళ్ళెవరు గాని రాజును దర్శించకూడదు. అయితే, ఇటువంటి కట్టుదిట్టమైన నిఘా ఎందుకు ఏర్పాటుచేశామన్న సంగతి నీ మనుషులకు కూడా తెలియకూడదు. జాగ్రత్త!" అని హెచ్చరించి మాంత్రికుడు అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

తెల్లవారగానే మంత్రి, మాంత్రికుడు చెప్పిన విధంగా తనకు విశ్వాసపాత్రులయిన భటులను భవనం చుట్టూ కాపలా వుంచాడు. సమీరుడు రాజదర్శనానికి వెళ్ళాలంటే భటులు అనుమతించలేదు.

రేపే యువరాణి జన్మదినం. కోలాహలంగా ఏర్పాట్లు జరుగుతున్నాయి. మంత్రీ, మాంత్రికుల కుట్ర గురించి ఎలాగైనా రాజుకు తెలియజేయాలని

అపూర్వుడు తీవ్రంగా ఆలోచించసాగాడు. రాజప్రాసాదం ఉపరితలంలో నిలబడి రోజూ సూర్యాస్తమయ దృశ్యం చూడడం రాజుకు అలవాటు. సమీరుడు ఈ విషయం అపూర్వుడికి తెలియజేశాడు. వెంటనే అపూర్వుడు ఒక తాళపత్రంమీద దుష్టుల పథకం గురించి క్లుప్తంగా రాసి, యువ రాణికీ, దేవీ ఆలయ పూజారికీ బలమైన రక్షణ ఏర్పాటు చేయాలనీ, ఎట్టిపరిస్థితి లోనూ యువరాణి, దేవీ ఆలయం లోపల, విగ్రహం వెనకకు పోరాదనీ రాసి, దూరంగా ఎగురుతూన్న ఒక గద్దను పిలిచాడు. అది వచ్చి అపూర్వుడి ఎదట వాలి, ఆ లేఖను అందుకుని, మరుక్షణమే రాజప్రాసాదం కేసి ఎగిరి వెళ్ళింది!

ముక్కుతో లేఖను తీసుకు వెళుతూన్న గద్దను చూడగానే, కాపలా భటుడొకడు ఉత్సాహం కొద్దీ దాని మీదికి ఒక బాణం వదిలాడు. బాణం గురి తప్పింది కాని, గద్ద బాణాన్ని చూసి బెదిరిపోయి, లేఖను కిందికి జారవిడిచి, మరొక దిక్కుకేసి పారి పోయింది. అపూర్వుడు రాసి పంపిన లేఖ కోటచుట్టూ వున్న అగడ్తలో పడిపోయింది!

గద్ద సగం దారిలోనే తిరిగి వెళ్ళడం అపూర్వుడు గమనించలేదు. తన లేఖను అది రాజుకు అందజేసి వుంటుందనీ, రాజు యువరాణికి కావలసిన రక్షణ ఏర్పాట్లు



చేయగలడనీ ఆశించి, ఏమి జరుగుతుందో ఎదురుచూడసాగాడు.

రాజధానీనగరం వేకువజాము నుంచే యువరాణి జన్మదిన వేడుకల కారణంగా కళకళలాడ సాగింది. రుద్రపురి రాజ్య ప్రముఖులూ, ఇరుగుపొరుగు రాజ్యాల నుంచి వచ్చిన రాజప్రతినిధులూ, రాజ బంధువులూ యువరాణికి శుభాకాంక్షలు తెలియజేయసాగారు. సమీరుడు జనం మధ్య తిరుగుతూ, అక్కడి విశేషాలను ఎప్పటికప్పుడు, చాటుగా వున్న అపూర్వు డికి తెలియజేయసాగాడు.

రాజు ముఖంలో గాని, యువరాణి ముఖంలో గాని ఎటువంటి మార్పూ లేక



పోవడం అపూర్వుడికి ఆశ్చర్యం కలిగించింది. యువరాణి రక్షణకోసం ప్రత్యేకంగా జాగ్రత్తలు తీసుకున్న సూచనలేవీ కనిపించలేదు. తాను గద్ద ద్వారా పంపిన లేఖ రాజుకు అందలేదేమో అన్న అనుమానం అపూర్వుడికి కలిగింది. సాయంకాలమయింది. రాజూ, యువరాణీ పరివారంతో అప్పుడే ఊరేగింపుగా దుర్గాదేవి మందిరానికి బయలుదేరినట్టు తెలిసింది. వెంటనే సమీరుడితో కలిసి అపూర్వుడు కూడా ఆలయం కేసి బయలుదేరాడు.

యువరాణి ఆలయానికి వస్తున్నదని తెలియగానే, ఆనందంతో వేలాదిమంది జనం అక్కడ గుమిగూడారు. యువరాణి తన చెలికత్తెలతో కలిసి ఆలయంలోకి అడుగుపెట్టగానే, పూజారి వేషంలో వున్న మాంత్రికుడు తన శిష్యులతో ఎదురు వచ్చి ఆమెను లోపలికి తీసుకువెళ్ళాడు. యువరాణి దుర్గామాతవిగ్రహం ముందు నిలబడి భక్తితో చేతులెత్తి నమస్కరించింది. పూజారి ఏవో మంత్రాలు గట్టిగా ఉచ్చరిస్తూ, యువరాణితో, "రా తల్లీ, రా. దుష్టసంహారిణి అయిన దుర్గామాతకు మూడుసార్లు ప్రదక్షిణ చేయడం శుభప్రదం!" అంటూ ముందుకునడిచాడు.

యువరాణి అతన్ని అనుసరించింది. పూజారి వెనక్కు తిరిగి, "యువరాణి తప్ప మరెవ్వరూ రాకూడదు. ఆమెచేత కొన్ని ప్రత్యేకమైన పూజలు చేయించాలి," అన్నాడు.

చెలికత్తెలు అక్కడే ఆగిపోయారు.

పూజారి శిష్యులిద్దరూ గట్టిగా మంత్రాలు పఠించసాగారు. భజంత్రీలతో, గంటానాదాలతో ఆలయం మారుమ్రోగుతున్నది.

యువరాణి గర్భగృహం వెనక్కు వెళ్ళగానే పూజారి వేషంలోని మాంత్రికుడు ఆమెను చప్పున సొరంగమార్గంలోకి తోసి, తానూ దిగిపోయి మార్గద్వారాన్ని మూసివేశాడు.

రాజు పరివారంతో ఆలయానికి వెలుపలే వున్నాడు. సమీరుడు జనం మధ్య నుంచి

హఠాత్తుగా ముందుకు వచ్చి, "మహా రాజా! యువరాణిని అపహరించుకుని పోయారు!" అన్నాడు.

రాజు సమీరుణ్ణి వింతగా చూశాడు.

"నేను సమీరుణ్ణి మహారాజా! నా మాట నమ్మండి. యువరాణిని మాంత్రికుడు అపహరించుకుని వెళ్ళిపోయాడు!" అన్నాడు సమీరుడు మళ్ళీ.

"యువరాణి దుర్గామాత దర్శనానికి ఆలయంలోకి వెళ్ళిందికదా ?" అన్నాడు రాజు.

"యువరాణి, అక్కడ లేదు!" అన్నాడు సమీరుడు.



"అలాగా!" అంటూ రాజు ఆలయంలోకి నడిచాడు. అంతలో చెలికత్తెలు యువరాణి కనిపించడం లేదని కంగారుతో పరిగెత్తుకుంటూ ఎదురు వచ్చారు.

అక్కడి నుంచి పారిపోవాలని చూస్తూన్న మాంత్రికుడి శిష్యులను చూడగానే సమీరుడు, "మహారాజా! ఆ దుర్మార్గులను పట్టి బంధించమని చెప్పండి." అన్నాడు.

వెంటనే శిష్యులిద్దరినీ భటులు పట్టుకున్నారు.

సమీరుడు, "మహారాజా, మనం ఇప్పుడే సారంగమార్గం అవతలి చివరను చేరుకోవాలి." అన్నాడు.

రాజూ, సేనానాయకుడూ, సమీరుడూ మరి కొందరు అంగరక్షకులూ గుర్రాల మీద బయలుదేరి, కొంతసేపటికల్లా, అరణ్య మధ్యంలో వున్న సారంగమార్గం అవతలి చివరను చేరుకున్నారు.

సమీరుడు, సేనానాయకుడి గుర్రం పైనుంచి కిందికి దిగుతూ, "మహారాజా! ఆ మంత్రగత్తెను పట్టి బంధించమనండి!" అన్నాడు.

"హఁహఁహ....నన్నే బంధించగల సమర్థులు వచ్చారా ? ఇప్పుడే మిమ్మల్ని భస్మం చేయగలను!" అంటూ వికటంగా నవ్వసాగింది, ఎండిపోయిన మర్రికొమ్మ మీద కూర్చున్న ముసలి మంత్రగత్తె.



''కూర్చున్నచోటు నుంచి కదిలావో, భస్మమైపోగలవు! జాగ్రత్త!'' అని హెచ్చరించింది ఒక గంభీరమైన కంఠస్వరం.

అందరూ ఆ కంఠస్వరం వినిపించిన దిక్కుకేసి చూశారు.

అక్కడ దివ్యతేజస్సుతో ఒక ముని పుంగవుడు కనిపించాడు. మునిని చూడగానే సమీరుడు ఆయన పాదాలకు నమస్కరించి, ''ఏదైనా జటిలమైన సమస్య ఎదురైనప్పుడు, భక్తితో స్మరిస్తే తమరు రాగలరని అపూర్వుడు నాకు చెప్పాడు!'' అన్నాడు.

సదానందముని చిన్నగా నవ్వి ఇలా అన్నాడు :

''అవును. నీవన్నది నిజం. ధ్యానంలో వుండగా అపూర్వుడి పిలుపు వినిపించి ఇలా వచ్చాను. అదిగో అక్కడ కూర్చున్నది మామూలు మంత్రగత్తె కాదు. గొప్ప శక్తులుగల పరమదుర్మార్గురాలు. ప్రకృతికి విరుద్ధంగా, పరుల యౌవనాన్ని కాజేస్తూ అనేక శతాబ్దాలుగా జీవిస్తున్నది. ఇప్పుడు యువరాణి యౌవనాన్ని కాజేయాలని పథకం వేసింది. అయినా, ఆ దుష్టురాలి శక్తులన్నిటినీ నాశనం చేశాను!''

మంత్రగత్తె కీచుమని అరిచి, ''నువ్వు నా శక్తులన్నిటినీ నాశనం చేయలేవు. నావద్ద ఇంకా ఒక శక్తి మిగిలి ఉన్నది.'' అని అడవి దద్దరిల్లే విధంగా బాధతో నవ్వుతూ, క్షణంలో భగ్గున మండి బూడిదయిపోయింది!

ఆ దృశ్యాన్ని చూసి ఒక్క క్షణం నివ్వెరపోయిన రాజు, సదానందమునికి నమస్కరిస్తూ, ''మహాత్మా, నా బిడ్డ క్షేమంగా ఉన్నది కదా?'' అని అడిగాడు.

''అపూర్వుడు కనిపించడం లేదే!'' అన్నాడు సమీరుడు.

''తన పథకం ఎదురుదెబ్బ తిన్నదని తెలియగానే, మంత్రగత్తె ఆ విషయాన్ని సారంగంలో వస్తూన్న మాంత్రికుడికి తెలియజేసింది. మాంత్రికుడు, తన ప్రాణాలు కాపాడుకోవడానికి యువరాణిని

అడ్డుగా ఉపయోగించుకొని, ఎలాగైనా చంద్రకాంతమణితో పారిపోవాలని చూశాడు. అందుకే అపూర్వుడు ఒక కన్నం ద్వారా సొరంగ మార్గంలోకి ప్రవేశించి, మాంత్రికుడితో పోరాడి బంధించాడు. అతడు యువరాణిని క్షేమంగా తీసుకురాగలడు," అన్నాడు ముని.

అంతలోనే మర్రి వృక్షం సమీపంలో భూమి అడుగునుంచి శబ్దం వినిపించింది. కొంతసేపటికి సొరంగమార్గ ద్వారం తెరుచుకుని దివ్యపురుషుడిలాగా కనిపించే ఒక యువకుడు, పెడరెక్కలు విరిచి కట్టిన మాంత్రికుణ్ణి లాక్కొని పైకి వచ్చాడు. మాంత్రికుడు వెలవెలబోతూ, నేలచూపులు చూడసాగాడు. వాళ్ళ వెనకగా వచ్చిన యువరాణి తండ్రిని చూడగానే పరుగునపోయి ఆయనపక్కన నిలబడింది.

యువకుడు ముని పాదాలకు నమస్కరించబోయాడు. ముని ఆప్యాయంగా వారించి, "నాయనా, అపూర్వా! నువ్వు మామూలుమానవాకారం పొందడానికి తగిన తరుణం ఆసన్నమయింది. ఇకపై ఇలాగే కొనసాగగలవు!" అన్నాడు.

"నాన్నా, నన్ను ఆ దుర్మార్గుడి బారినుంచి ఈ యువకుడే రక్షించాడు!" అన్నది యువరాణి అపూర్వుణ్ణి చూపుతూ.

"అతడు చేసిన ఉపకారం ఈ జన్మలో మరువరానిది!" అంటూ రాజు అపూర్వుడికేసి చూశాడు.



"నేను వచ్చిన పని పూర్తయింది. ఇక వెళ్ళివస్తాను," అన్నాడు ముని.

"నేనూ, మీతో వస్తాను," అన్నాడు అపూర్వుడు.

"నిన్ను నా వెంట తీసుకు వెళ్ళడానికా నీకు మామూలు మానవరూపం ఇచ్చాను? ఇంతవరకు నువ్వు ఎవ్వరికీ కనిపించకుండా, మంచివారికి మేలు చేస్తూ వచ్చావు. ఈ క్షణం నుంచి, సాధారణ మానవరూపంలో, అందరికీ కనిపిస్తూ, ప్రజానాయకుడిగా అచంచలమైన ధైర్య సాహసాలతో, ధర్మదీక్షతో నీ కర్తవ్యాన్ని నిర్వహించాలి!" అన్నాడు ముని.

"అదెలా సాధ్యం?" అని అడిగాడు అపూర్వుడు అనుమానంగా.

ముని ఏదో అనబోయేంతలో, రాజు, "ఈనాటి నుంచి నా రాజ్యం నీ అధీనంలో వుంటుంది. ముని అంగీకరించినట్టయితే నువ్వే నా రాజ్యానికి వారసుడివి కాగలవు. నీకూ, నా కుమార్తెకూ ఇష్టమయినట్టయితే, యువరాణి మేనమామ రాజ్యం లావణ్యపురికి కూడా నువ్వే అధిపతివి కాగలవు!" అన్నాడు.

అపూర్వుడు యువరాణి కేసి చూశాడు. యువరాణి సిగ్గుతో తల వంచుకున్నది. సదానందముని వాళ్ళిద్దరినీ దగ్గరికి పిలిచి, "మీరు మునుముందు మానవజాతికి మేలు కలిగించే ఘనకార్యాలెన్నో సాధించి, భావితరాలకు ఆదర్శదంపతులు కాగలరు!" అని ఆశీర్వదించి, అదృశ్యమై పోయాడు.

రాజుతో సహా అక్కడి వారందరూ ఒక్క క్షణం ఆశ్చర్యపోయి, ఆ తరవాత అమితానందం చెందారు.

రాజు మాంత్రికుణ్ణీ, మంత్రినీ చెరసాలలో బంధించమని ఆజ్ఞాపించాడు.

యువరాణికీ, అపూర్వుడికీ వైభవంగా వివాహం జరిగింది. రాజు, అపూర్వుడికి రుద్రపురిరాజ్య పట్టాభిషేకం చేశాడు. అపూర్వుడు సమీరుణ్ణి తన ప్రధానమంత్రిగా చేసుకుని చిరకాలం ప్రజారంజకంగా పరిపాలన సాగించాడు. —(అయిపోయింది)






# పాప భారం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ప్రతిసారీ ప్రయత్నం విఫలమవుతున్నా, ఈ అర్ధరాత్రివేళ భయంకరమైన, ఈ శ్మశానంలో ఏపుణ్యం ఆశించి, ఈ పనికి పూనుకున్నావో నాకు తెలియదు. కాని, ఒక్కొసారి పుణ్యకార్యం చేసినప్పటికీ, విధివశాత్తూ పాపంగా పరిణమించడం కద్దు. ఇందుకు నిదర్శనంగా చేయని నేరానికి తనను తానే శిక్షించుకున్న చంద్రసేనుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

పూర్వం ఉజ్జయినీ నగరాన్ని చంద్రసేనుడనే రాజు పాలించేవాడు. ప్రజలను

## బేతాళ కథలు



కన్నబిడ్డలలా ఆదరంగా చూసుకునే చంద్రసేనుడికి కవులు, పండితులు అంటే వల్లమాలిన అభిమానం. నిత్యం వివిధ సాహితీగోష్ఠులతో ఆస్థానం సరస్వతీ మందిరంలా శోభిల్లేది.

ఇలా వుండగా, కాశీ నుంచి వచ్చిన శివదత్తుడనే పండితుడు, ఒకనాడు రాజు దర్శనం కోరాడు. రాజు ఆయనను సగౌరవంగా సభకు ఆహ్వానించాడు. శివదత్తుడు తనకు గల అపారపాండిత్యంతో, రాజుతో పాటు సభలో వున్న కవులనూ, పండితులనూ రంజింపచేశాడు. సభ ముగిశాక రాజు చంద్రసేనుడు శివదత్తును ఆదరంతో కౌగలించుకుని, తన మెడలోని అమూల్యమైన రత్నహారాన్ని కానుకగా ఇచ్చి ఘనంగా సత్కరించాడు.

శివదత్తుడు సభకు వీడ్కోలు చెప్పి, తిరిగి కాశీకి ప్రయాణమయ్యాడు. అయితే, దురదృష్టవశాన ఆయన క్షేమంగా స్వస్థలం చేరలేకపోయాడు. మార్గమధ్యంలో రత్నహారం కోసం, ఒక గజదొంగ ఆయనను హత్యచేశాడు. చంద్రసేనుడి వేగులు గజదొంగను బంధించి, రాజధానికి తీసుకువచ్చి, రాజు ముందు హాజరుపరిచారు.

శివదత్తుడిదుర్మరణానికిచంద్రసేనుడు తీవ్రమనస్తాపానికి గురయ్యాడు. ఆయన ఆగ్రహం పట్టలేక అప్పటికప్పుడే విచారణ చేసి, గజదొంగకు ఉరిశిక్ష విధించాడు.

అయినా, ఆ రోజు నుంచి రాజుకు మనశ్శాంతి కరువైపోయింది. శివదత్తుడి అకస్మికమరణానికి, తానే పరోక్షంగా కారణభూతం అన్న ఊహ, ఆయనను మానసికంగా కృంగదీయసాగింది.

రాజు, అన్నివేళలా, "నేను అభిమానంతో ఇచ్చిన కానుకే కాలసర్పమై శివదత్తును కాటువేసింది. నేను హంతకుణ్ణి! నా పాపానికి నిష్కృతి లేదు," అంటూ పరితపించేవాడు.

ఆయన క్రమంగా రాజ్యవ్యవహారాల పట్ల శ్రద్ధ చూపడం మానివేశాడు. చివరకు ఆ దిగులుతో మంచం పట్టాడు. రాజవైద్యు

డెంత ప్రయత్నించినా, ఆ మనోవ్యాధిని నయం చెయ్యలేకపోయాడు.

ఈ పరిస్థితుల్లో, చతుర్వేది అనే ఒక మహిమగల సన్యాసి ఆస్థానానికి వచ్చాడు. మహారాణి, మంత్రి ఆయనకు రాజు పరిస్థితిని వివరించి, తరుణోపాయం చెప్పమని ప్రార్థించారు. చతుర్వేది, రాజు శయన మందిరంలోకి వెళ్ళాడు. ఎముకలగూడులా మంచానికి అంటుకుని వున్న రాజును చూడగానే, ఆయన మనసు ద్రవించింది.



చతుర్వేది, రాజు పక్కనే కూర్చుని, వాత్సల్యంతో తల నిమిరి, "నాయనా! క్షత్రియుడివైన నీకు బేలతనం పనికి రాదు. యుద్ధభూమిలో నువ్వు కొన్ని వందలమంది శత్రువులను హతమార్చి వుంటావు. మరి వాళ్ళ గురించి ఎప్పుడైనా దిగులుపడ్డావా? లేదే! ఒక దొంగ పేరాశతో చేసిన హత్యకు, నువ్వెందుకు నైతిక బాధ్యత వహించాలో నాకు అంతుబట్టడం లేదు. ఆ దొంగకు మరణశిక్ష విధించడంతో, నీ కర్తవ్యం తీరిపోయింది. ఇక, అకారణమైన దిగులెందుకో చెప్పు, నాయనా?" అని అడిగాడు.

ఇందుకు రాజు, "ఏమో, స్వామీ, నేనొక శాపగ్రస్తుణ్ణి! ఎన్నివిధాల ప్రయత్నించినా, నా మనసుకు స్వస్థత చేకూరడం లేదు," అన్నాడు విచారంగా.

చతుర్వేది కాసేపు మౌనంగా వుండి, "పోనీ, నా తపశ్శక్తితో శివదత్తుడిని బతికిస్తే, నీకు మనశ్శాంతి కలుగుతుందేమో, ఆలోచించి చెప్పు, నాయనా!" అన్నాడు మందహాసం చేస్తూ.

ఈ మాటలు వింటూనే, ఒక్కక్షణం చంద్రసేనుడి ముఖం వింతకాంతితో వెలిగిపోయింది. కాని మరుక్షణం వివర్ణమైంది. ఆయన చేతులెత్తి, చతుర్వేదికి నమస్కరిస్తూ, "మహాత్మా! శివదత్తుడితో పాటు, గజదొంగను కూడా బతికించలేరా?" అని అర్థించాడు.

"అంతశక్తి నాకు లేదు, నాయనా! నాకున్నతపశ్శక్తి సమస్తం ధారపోస్తే,

ఒకరిని మాత్రమే బతికించగలను,'' అన్నాడు చతుర్వేది.

''అలా అయితే, తెలిసి తెలిసి పాప భారం పెంచుకోవడమెందుకు? శివదత్తుడిని బతికించవద్దులే, స్వామీ!'' అని నిట్టూర్చాడు చంద్రసేనుడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, చంద్రసేనుడి ప్రవర్తన విడ్డూరంగాలేదా? చతుర్వేది, శివదత్తుడిని బతికిస్తానంటే వద్దనడం, మూర్ఖత్వం కాదా? ఇది తన మనసుకు శాంతి లభించే అరుదైన అవకాశాన్ని చేజేతులా జారవిడుచుకోవడమే అవుతుంది గదా! దీనికి తోడు గజదొంగను కూడా బతికించమని కోరడం అర్థ రహితం కాదా? చతుర్వేది, శివదత్తుడిని బతికిస్తే, తన పాపభారం పెరుగుతుందని, చంద్రసేనుడు భావించడాన్ని అమాయకత్వమనాలా లేక వెర్రితనమనాలా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''చంద్రసేనుణ్ణి మూర్ఖుడనో, అమాయకుడనో అనుకోవడం, వాస్తవాన్ని గుర్తించలేకపోవడం అవుతుంది. ఆయన తార్కిక బుద్ధితోపాటు, తాత్విక చింతన కూడా కలవాడు. చతుర్వేది, శివదత్తుడిని బతికించడమంటే తాను గజదొంగకు విధించినమరణశిక్ష అన్యాయమవుతుంది! ఆ పాపంతో పాటు చతుర్వేది తపశ్శక్తిని కూడా హరించిన పాపం కూడా, తనకు చుట్టుకుంటుందని, చంద్రసేనుడు గ్రహించాడు. ఈ ధర్మసూక్ష్మాన్ని తెలుసుకున్నాడు కనకనే, శివదత్తుడితో పాటు దొంగను బతికించడానికి, తన తపశ్శక్తి చాలదని చతుర్వేది తన అశక్తతను వెల్లడించినప్పుడు, శివదత్తుడిని కూడా బతికించవద్దని ఆయన కోరాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం: ఆర్. పట్టాభిరామరాజు రచన]






# అందమైన మనసు

ధర్మాపురం అనే ఊళ్ళో కేశవయ్య, రామయ్య అనే ఇద్దరు స్నేహితులుండే వారు. వాళ్ళు బతుకుతెరువుకోసం చెరొక ఊళ్ళో స్థిరపడ్డా, వాళ్ళ స్నేహానికి ఎలాంటి ఆటంకమూ కలగలేదు. తరచుగా ఇద్దరూ కలుసుకుని మంచి చెడ్డలు మాట్లాడుకునేవారు. ఒకరి కష్టసుఖాలు ఇంకొకరికి చెప్పుకునేవారు.

క్రమంగా ఇద్దరూ వ్యాపారంలో లక్షలార్జించారు. కేశవయ్య కొడుకు విద్యాధరుడూ, రామయ్య కూతురు మందాకినీ పెళ్ళీడు వాళ్ళయ్యారు. కేశవయ్యా, రామయ్యా తమ స్నేహానికి గుర్తుగా తమ పిల్లలిద్దరికీ పెళ్ళిచేసి, స్నేహాన్ని బంధుత్వంగా మార్చుకోవాలనుకున్నారు.

ఒకనాడు వాళ్ళు, తమ పిల్లలకు ఈ సంగతి చెప్పారు. ఇది విన్న మందాకిని ఆనందంతో ఉక్కిరిబిక్కిరై పోయింది. ఆమె విద్యాధరుణ్ణి వివాహమాడాలని ఎంతోకాలంగా అనుకుంటున్నది. అయితే, విద్యాధరుడు మాత్రం ఆమెను వివాహమాడడానికి ఒప్పుకోలేదు. కారణం, మందాకిని పెద్ద అంతగత్తె కాకపోవడం.

కేశవయ్య ఈ వివాహానికి ఒప్పుకోవలసిందిగా, కొడుక్కు ఎన్నో విధాల చెప్పి చూశాడు. అయినా, విద్యాధరుడు మొండిగా, "నా క్కావలసింది గొప్ప సౌందర్యవతి అయిన భార్య. అందుకోసం నేను దేశాటనకు బయలుదేరుతున్నాను," అన్నాడు.

ఇందుకు కేశవయ్య అయిష్టంగా, "కాబోయే భార్యను వెతికి వరించేందుకు, నువ్వేమీ రాజకుమారుడివి కాదు! నా మాటవిని మందాకినిని చేసుకో," అన్నాడు.

"నేను రాజకుమారుణ్ణి కాకపోవచ్చు. కాని, నాకు నచ్చిన, ఇష్టమైన యువతిని

రావినూతల సువర్నాకన్నన్



వివాహమాడే హక్కు నాకున్నది.'' అంటూ విద్యాధరుడు అప్పటికప్పుడే దేశాటనకు బయలుదేరాడు.

ఈ జరిగినదానికి కేశవయ్యతోపాటు, రామయ్య కూడా దిగులు చెందాడు. అయితే, మందాకిని మాత్రం ఏమాత్రం చలించకుండా, ''చాలామంది లాగే విద్యాధరుడిది ఊహాలోకాల్లో జీవించే తత్వం. మనిషి చాలా మంచివాడు. ఎలాగైనా నేనతడి మనసు మార్చి, అతడి చేత తాళి కట్టించుకోగలను, అనుమతించండి!'' అని వాళ్ళను ఒప్పించి, మగవేషం ధరించి, విద్యాధరుణ్ణి వెతుకుతూ బయలుదేరింది. ఆమె వారం రోజుల తర్వాత అతణ్ణి, ఒక గ్రామంలో కలుసుకున్నది.

మగవేషంలో వున్న మందాకినిని గుర్తించని విద్యాధరుడు, ఆమెతో తాను దేశాటనకు బయలుదేరిన కారణం చెప్పి, ''ఆరునూరైనాసరే, ఆరు సంవత్సరాల పాటు ఇలా ఊళ్ళు పట్టుకు తిరగవలసిన పరిస్థితి ఎదురైనాసరే—లోకంలో అత్యంత సౌందర్యవతి అయిన అమ్మాయిని తప్ప, నేను మరొకరిని పెళ్ళాడదలచలేదు. సరే, నీ సంగతేమిటి?'' అని ప్రశ్నించాడు.

ఇందుకు మందాకిని పెద్దగా నిట్టూర్చి, ''నాకు సంగీతమంటే ప్రాణం, ఆడపిల్ల అందచందాలతో నాకు పని లేదు. కొన్నాళ్ల కిందట ఏమాత్రం అందగత్తె కాని ఒక అమ్మాయిని ప్రేమించాను. ఆమెది కోకిల కంఠం. అద్భుతంగా సంగీతం పాడేది. అయితే, ఒక ప్రమాదం జరిగి ఆమె కంఠం శాశ్వతంగా మూగపోయింది. దానితో నాకు జీవితం పట్ల విరక్తి కలిగి, మనశ్శాంతి కోసం దేశాటన చేస్తున్నాను,'' అన్నది.

''చూశావా! ఎవరిలోకం వాళ్ళది. మనిద్దరి కోరికల్లో ఎంతతేడా! నన్ను మందమతి అనుకోకు. నేను పెళ్ళాడబోయే యువతి రంభా, ఊర్వశీ లాంటి అతిలోకసుందరి అయుండాలి. కంఠస్వరం కాకీ, గుడ్లగూబలకన్నా వికృతంగా,

కఠోరంగా వున్నా ఫర్వాలేదు.'' అన్నాడు విద్యాధరుడు.

''అలా ముందే చెప్పావు కాదేం?'' అంటూ మందాకిని ఒకటి, రెండు క్షణాలు ఆలోచిస్తూ వూరుకుని, తర్వాత, ''ఆఁ, గుర్తుకొచ్చింది. సంవత్సరం కిందట మా నాన్నతో కలిసి తీర్థయాత్రకు వెళ్ళి తిరిగొస్తూ, ఇక్కడికి సమీపంలో వున్న పట్టణంలోని ఒక పూటకూళ్ళ ఇంట దిగాను. ఆ పూటకూళ్ళావిడ చాలా పేదరాలు. ఆమె కూతురు గొప్ప శిల్పి చేసిన పాలరాతి విగ్రహంలా వుంటుంది. ఆమె అందాన్ని గురించి రాజభవనంలో కూడా చెప్పుకుంటారని విన్నాను. కావాలంటే వాళ్ళింటికి వెళదాం. ఆ అమ్మాయిని స్వయంగా చూద్దువుగాని,'' అన్నది.

''అంతకంటే కావలసిందేముంది, పద!'' అన్నాడు విద్యాధరుడు తన్మయుడై పోతూ.

ఇద్దరూ పట్నం చేరి, పూటకూళ్ళ ఇంటికి వెళ్ళారు. పూటకూళ్ళమ్మ వాళ్ళకు కాళ్ళూ, చేతులూ కడుక్కునేందుకు నీళ్ళిచ్చి, తర్వాత భోజనం వడ్డించింది.

భోజనం చేస్తున్న సమయంలో మందాకిని, పూటకూళ్ళమ్మను, ''పెద్దమ్మా! సంవత్సరం కిందట నేను మా నాన్నతో కలిసి ఇక్కడికి వచ్చాను. అప్పుడు దేవకన్య లాంటి, నీ కూతురును చూశాను. ఏదీ, ఆ అమ్మాయి కనబడదే!'' అన్నది.



అందుకు పూటకూళ్ళమ్మ దిగులుగా ముఖం పెట్టి, ''నువ్వు రెండు సంవత్సరాల కిందట కాక, సంవత్సరం కిందట వచ్చివుంటే, నా కూతుర్ని కాక దాని చిత్రపటాన్ని చూసి వుంటావు. ఏం దేవకన్యలు, ఏం అందచందాల్లే, నాయనా!'' అంటూ ఒక చిత్రపటం తెచ్చి వాళ్ళకు చూపింది.

ఆ చిత్రపటంలోని యువతి అందం చూసి, విద్యాధరుడు మూర్ఛపోయినంత పనిచేసి, ''ఏదీ, నీ కూతుర్ని ఒకసారి ఇక్కడికి రమ్మనరాదా!'' అన్నాడు.

పూటకూళ్ళమ్మ అయిష్టంగా పక్క గదిలోకి పోయి, కూతురును వాళ్ళ ముందుకు తీసుకువచ్చింది. ఆమెను చూసి విద్యాధరుడు నిర్ఘాంతపోయాడు. ఆమె ముఖం నిండా నల్లటి మచ్చలు; ఒక కంటిలో తెల్లని పువ్వు.

పూటకూళ్ళమ్మ ఒకసారి కళ్ళు తుడుచుకుని, బొంగురుపోయినగొంతుతో, "అంతా దాని తలరాత, బాబూ! పెళ్ళి చేద్దాం అనుకుంటుండగానే, ఆ మాయదారిజబ్బు సోకి ఇలా అయిపోయింది. మనిషికి ఏదీ శాశ్వతం కాదు, బాబూ—ముఖ్యంగా అందం, యవ్వనం!" అన్నది.

ఆ మాటలు విన్న విద్యాధరుడికి, తననెవరో గట్టిగా కొరడాతో వీపు మీద కొట్టినట్టయింది. అతడు ఆలోచనలో పడ్డాడు. దేవకన్య లాంటి అమ్మాయిని చేసుకున్నా, ఆవిడ అందం శాశ్వతంగా అలాగే వుంటుందని నమ్మకమేమిటి? అందుకు ప్రత్యక్ష సాక్ష్యం, పూటకూళ్ళమ్మ కూతురు! మందాకిని అందగత్తె కాకపోయినా, ఆమెది అందమైన మనసు. ఇంట్లో స్వచ్ఛమైన వెన్న వుంచుకుని, వీధి దుకాణాల్లోని నెయ్యికోసం పరుగులు తీసేవాడిలా తాను ప్రవర్తించాడు. సుగంధపుష్పం లాంటి మందాకినిని కాదని, అందం అంటూ తంగేడుపూలకోసం ఆరాటపడుతున్న మూర్ఖుడు, తను!

విద్యాధరుడు సొంతం భోజనం చెయ్యకుండానే లేచి, పూటకూళ్ళమ్మకు డబ్బిచ్చి, మందాకినితో, "మనిద్దరం స్నేహితులమో, బాటసారులమో నాకు తెలియదు. ఏదో కొన్నాళ్ళపాటు కలిసి తిరిగాం. ఇన్నాళ్ళకు నా కళ్ళు తెరుచుకున్నాయి. ఇంటికిపోయి అందమైన మనసుగల అమ్మాయిని పెళ్ళాడబోతున్నాను. ఇక ఒంటరిగా, నీ కోకిల కంఠాన్ని వెతికి పట్టుకో!" అని బయలుదేరాడు.

విద్యాధరుడు తన ఊరు చేరినరోజునే, మందాకిని కూడా తన ఊరుచేరి జరిగినదంతా తల్లిదండ్రులకు చెప్పింది. వాళ్ళకు కలిగిన ఆనందం అంతా ఇంతా కాదు.



# చందమామ అనుబంధం—41




మనదేశపు పక్షులు-జంతువులు :

## గరుడపక్షి

పెద్ద ఆకారం గల పక్షులలో గరుడపక్షి ప్రధానమైనది. అరడుగుల పొడవైన రెక్కలతో ముదురు గోధుమ వర్ణంతో చాలా గంభీరంగా కనిపించే ఈ పక్షి మాంసాహారి. దీని ముక్కూ, గోళ్ళూ చాలా దృఢంగానూ, పదునుగానూ వుంటాయి. గరుడపక్షి దృష్టి చాలా నిశితమైనది. ఆకాశంలో, మామూలు పక్షులు ఎగరలేని చాలా ఎత్తులో ఎగురుతూ, నేల మీది ఆహారాన్ని పసిగట్టి, గురి తప్పకుండా సరిగ్గా వాటి మీదే వాలగలశక్తి కలిగినవీ పక్షులు. ఎత్తయిన కొండ శిఖరాల మీదా, కొండల మధ్య బండరాళ్ళలో గూళ్ళుకట్టే గరుడపక్షిని పక్షులకు రాజుగా చెబుతారు!

గరుడపక్షికి మన పురాణాలలో ప్రత్యేకస్థానం ఉన్నది. మహావిష్ణువు వాహనం 'గరుత్మంతుడు.' వినతాతనయుడయిన గరుడిని పేరు మీదుగానే 'గరుడపురాణం' ప్రసిద్ధి గాంచింది.

గరుత్మంతుడు తల్లి దాస్యవిముక్తి కోసం, స్వర్గాధిపతి అయిన ఇంద్రుడివద్దకు వెళ్ళి అమృతం కావాలని కోరాడు. ఇంద్రుడు ఇవ్వడానికి నిరాకరించడంతో, అతన్ని యుద్ధంలో ఓడించి, అమృతకలశాన్ని తీసుకువచ్చి తల్లి బానిసత్వం పోగొట్టాడు. గరుత్మంతుడి ధైర్యానికీ, బలపరాక్రమాలకూ మెచ్చి, ఇంద్రాదుల ప్రార్థనమేరకు మహావిష్ణువు అతన్ని తన వాహనంగా స్వీకరించాడు.

పురాణ ప్రసిద్ధిగాంచిన గరుడపక్షులలో జటాయువు, సంపాతి, సుపర్ణ ముఖ్యమైనవి!

వార్తలలో బాలలు:

# బేబీ షామిలీ!



ఇటీవల జరిగిన 'కిలుకన్ పెట్టి' (గిలక) అనే ఒక మలయాళ చిత్రం షూటింగ్‌లో దర్శకుడు 'యాక్షన్' అనగానే కెమెరా ముందు నిలబడిన ఐదేళ్ళపాప ముఖంలో ఏడుపుతోపాటు కళ్ళనుంచి బొటబొటా నీళ్ళు కారాయి. మామూలుగా నటీ నటులు ఉపయోగించే 'గ్లిజరిన్' లేకుండానే ఆ పాప కళ్ళ నుంచి నీళ్ళు కారాయి. డైరెక్టర్ 'కట్' అనగానే, మీట నొక్కినట్టు కన్నీళ్ళు తక్కున ఆగిపోయాయి. ఆ పాపాయి నటనకు అక్కడి వారందరూ అమితాశ్చర్యం చెందారు.

అ పాపాయి మరెవరో కాదు. గత సంవత్సరం 'అంజలి' అనే తమిళ చిత్రంలో అద్భుతమైన నటనను ప్రదర్శించి, 'ఉత్తమ బాలనటి' అవార్డును అందుకున్న బేబీ షామిలీ. ఇవాళ ఒక చిత్రంలో నటించడానికి లక్షరూపాయలు పుచ్చుకుంటూన్న 'బాలతార' బేబీ షామిలీ! ఈనాడు మన దేశంలో అదాయపు పన్ను చెల్లిస్తున్న అతి పిన్న వయస్కురాలు షామిలీ! ఇప్పుడు షామిలీ మలయాళం, తమిళం, తెలుగు భాషలలో దాదాపు ఇరవై చిత్రాలలో నటిస్తున్నది.

అయిదేళ్ళ పాప ఒకేసారి ఇన్ని చిత్రాలలో ఎలా నటించగలుగుతున్నది? ఆమె తండ్రి ఎ. ఎస్. బాబు ముందుగానే చిత్ర దర్శకుడి వద్ద షామిలీ నటించవలసిన సినిమాకథ, సన్నివేశం, సంభాషణలు తెలుసుకుంటాడు. ఆయనే ఇంటి వద్ద షామిలీకి ఏ సన్నివేశంలో ఎలా నిలబడాలో, ఎలా నడవాలో, ఎలా మాట్లాడాలో క్షుణ్ణంగా శిక్షణ నిస్తాడు. అందువల్ల మర్నాడు కెమెరా ముందుకు రాగానే. ఆమె దర్శకుడు చెప్పే విధంగా సునాయాసంగా నటించగలుగుతున్నది!

ఆమె తండ్రి, ఆమెతోపాటే షూటింగ్‌కు వచ్చి, ఆమె అవసరాలన్నీ తీరుస్తూ, తోడుగా వుంటాడు. ఆమె ఎప్పుడైనా కోపంతో మారాం చేస్తే చాక్లెట్లూ, స్వీట్లూ ఇచ్చి బుజ్జగిస్తాడు!

నెలలో దాదాపు ఇరవైరోజులు షూటింగ్‌లో పాల్గొనే బేబీ షామిలీ మిగతా పది రోజులు బడికి వెళుతుంది. ఆమె ఇంటి దగ్గర, "నేను, రోజూ స్కూలుకు వెళ్ళి చదువుకుంటాను!" అని నిజంగానే అప్పుడప్పుడు ఏడుస్తుంది. అన్నయ్య రిచర్డ్‌తోనూ, అక్కయ్య షాలిని (ఆమె కూడా నిన్నటి బాలనటి) తోనూ ఆడుకోవడానికి ఇష్ట పడుతుంది.

రెండేళ్ళ పాపగా ఉన్నప్పుడు చిత్రాలలో నటించడం ప్రారంభించిన బేబీ షామిలీ, మరొక ఐదేళ్ళయినా నటించాలన్నది ఆమె తండ్రి కోరిక!

# మీకు తెలుసా?

1. 'స్వర్గమందిరం' ఎక్కడ ఉన్నది?
2. ప్రపంచంలోకెల్లా అతి ప్రాచీనమైన జంతు ప్రదర్శనశాల ఎక్కడ ఉన్నది?
3. 1452 వ సం॥లో జన్మించిన ఒక ఇటలీ దేశస్థుడు, చిత్రకారుడుగా, సంగీత విద్వాంసుడుగా, గణితశాస్త్రజ్ఞుడుగా, శాస్త్రవేత్తగా ప్రసిద్ధిగాంచాడు. ఆయన ఎవరు?
4. 'గళ్ళనుడికట్టు' మొట్టమొదట ఎక్కడ, ఎప్పుడు ప్రచురించారు?
5. ఒక బాలిక ఉత్తరం అందుకున్నాకే, అమెరికా అధ్యక్షుడు అబ్రహాం లింకన్ గడ్డం పెంచడం ప్రారంభించాడని చెబుతారు. ఆ బాలిక ఎవరు?
6. వచ్చే ఒలింపిక్ క్రీడలు జూలైలో స్పెయిన్‌లో జరుగనున్నాయి. ప్రప్రథమంగా 'ఒలింపియాడ్' ఎప్పుడు జరిగింది. ఆధునిక ఒలింపిక్ క్రీడలు మొట్టమొదట ఎక్కడ జరిగాయి?
7. 'కరాటే' అంటే అర్థం ఏమిటి?
8. గ్రీకు యాత్రికుడు మెగస్తనీస్ భారతదేశంలో సందర్శించిన సంస్థానం ఏది?
9. గాంధీజీ తన 'రాజకీయ గురువు'గా ఎవరిని భావించాడు?
10. జూలియస్ సీజర్ పేరు మీదుగా 'జూలై' నెలకు పేరు వచ్చింది. అతని మేనల్లుడు పేరు మీదుగా ఏ నెలకు పేరు ఏర్పడిందో తెలుసా?
11. అక్బర్ ఆర్థికమంత్రి ఎవరు?
12. 'రఘువంశాన్ని' ఎవరు రచించారు?
13. వినాయకుడి వాహనంగా చిట్టెలుకను చెబుతారు. ఎలుకలను భక్తిశ్రద్ధలతో ఆహారం ఇచ్చి రక్షించే దేవాలయం మన దేశంలో ఎక్కడ ఉన్నదో తెలుసా?
14. నెపోలియన్ మొట్టమొదట ఏ ద్వీపానికి వెళ్ళగొట్టబడ్డాడు?
15. గరుడపక్షి–పాము జాతీయ పతాకంలో గల దేశం ఏది?

## సమాధానాలు

1. పీకింగ్, చైనా.
2. ఆస్ట్రియా వియన్నాలోని ష్కాన్‌బ్రన్. 1752 వ సం॥లో ఏర్పరచబడింది.
3. లియొనార్డో డా విన్సీ.
4. 'న్యూయార్క్ వరల్డ్'. 1913 వ సం॥ డిసెంబర్ 21 వ తేదీ. దానిని ఆర్థర్ విన్ రూపొందించాడు.
5. గ్రేస్ బ్రెడెల్.
6. క్రీ. పూ. 776 వ సం॥లో. గ్రీసులోని ఒలింపియాలో. ఆధునిక ఒలింపిక్ క్రీడలు 1896 వ సం॥లో గ్రీసులోని ఏథెన్స్‌లో జరిగాయి.
7. 'వట్టిచేయి'.
8. చంద్రగుప్త మౌర్యుడు.
9. గోపాలకృష్ణగోఖలే.
10. ఆగస్టు. అగస్టస్ సీజర్.
11. తోడరమల్.
12. కాళిదాసు.
13. రాజస్థాన్‌లోని కర్నిమాత.
14. ఎల్బా.
15. మెక్సికో.



## రెండుమైళ్ళ ఉత్తరం!

బంధువులకూ, స్నేహితులకూ సుదీర్ఘమైన ఉత్తరాలు రాయడం కొందరికి అలవాటు. అయితే, ఈ విషయంలో నేపాల్‌కు చెందిన ఇరవైయేళ్ళ రాజేంద్రచంద్ ఠాకూరీని ఎవరూ మించలేరు. ఠాకూరీ, భారతదేశంలో వున్న తన మిత్రుడికి ఏకంగా 10,315 పేజీల ఉత్తరం రాశాడు! ఆ ఉత్తరం బరువు 42 కి.గ్రా. ఆ నేపాలీ యువకుడు తాను రాసిన 5,153 కాగితాలను ఒకదాని చివర మరొకదానిని చేర్చుకుంటూ వెళితే 2 మైళ్ళ పొడవు వుంటుందని అంచనా వేశాడు. నూతన సంవత్సరారంభంలో ఆ 'ఉత్తరాన్ని' అందుకున్న భారతీయమిత్రుడు, ఫిబ్రవరి వచ్చినా చదువుకుంటూనే ఉన్నారు!

# చందమామ కబుర్లు

## జీవన పోరాటం!

ఆస్ట్రేలియాలోని వాయవ్యభాగంలో నిర్మానుష్యంగా వున్న ఒక నదీతీరంలో పశువులు కాచుకుంటూన్న కొందరు, హఠాత్తుగా అక్కడ జనవరి 16 వ తేదీన 35 మంది చైనా దేశస్థులను చూసి అమితాశ్చర్యం చెందారు. తాము ప్రయాణం చేస్తున్న పడవ తిరగబడడంతో, అతి కష్టం మీద తీరం చేరి, కీకారణ్యంలోపడి 200 కి.మీ. నడిచి వచ్చినట్టు వాళ్ళు చెప్పారు. అన్నాళ్ళు, అంతదూరం వాళ్ళెలా ప్రాణాలు నిలుపుకోగలిగారు? మొదట వాళ్ళొక మొసలిని చంపి, కొంత తిని మిగతా మాంసాన్ని కాల్చి వెంట తెచ్చుకున్నారు. ఎదురుపడ్డ పాములనూ, లభించిన చేపలనూ, తింటూ ఒకసారి పెద్ద ఉడుమును కూడా చంపి తిన్నారట. పక్షులను తప్ప మిగతా అన్నిటినీ చంపి తింటూ, ఎండకు విశ్రాంతి తీసుకుంటూ వాళ్ళు ఎలాగో ప్రాణాలతో బయటపడగలిగారు!





# వినతగ్గ మాట

విక్రమసేనుడనే రాజుకు, చతురుడు మహామంత్రి. రాజకార్యాలకు మంత్రి సలహాలనే పాటించే మంచి అలవాటు రాజుకున్నది. అందువల్ల చతురుడు సమాలోచనలకు పదిమంది మంత్రులను నియమించాడు. రాజుకు సలహా ఇచ్చే ముందాయన మంత్రులతో విషయం చర్చించేవాడు.

పదిమంది మంత్రులలో శచీంద్రుడనే తుంటరివాడొకడున్నాడు. అందరూ ఔనంటే కాదనడం, కాదంటే ఔననడం వాడి అలవాటు. రాజకార్యాల సమాలోచనకు అటువంటివాడి అవసరముంటుందని భావించి, మహామంత్రి వాణ్ణి భరిస్తూ వచ్చాడు. మిగతా మంత్రులకు మాత్రం వాళ్ల ధోరణి బొత్తిగా నచ్చేది కాదు. అయితే, వారికంటే శచీంద్రుడే ఎక్కువ అసంతృప్తిని ప్రకటిస్తూ, ''మీరంతా ఒక్కటి. ఎన్ని చెప్పినా నా మాటలు ఏమాత్రం సాగనివ్వరు. అందువల్ల దేశం బాగుపడకుండా పోతున్నది,'' అంటూండేవాడు.

శచీంద్రుడికి చాడీలు చెప్పే గుణం కూడా వున్నది. వాడు తరచుగా రాజును కలుసుకుని, తన మాట ఎవరూ వినడం లేదని గోలపెట్టేవాడు.

రాజు వాడితో, ''మహామంత్రి నిర్ణయం మీద నాకు నమ్మకమున్నది. ఆయన అధిక సంఖ్యాకుల అభిప్రాయానికి విలువనిస్తాడు. నీ అభిప్రాయం అధిక సంఖ్యాకులతో కలవడం లేదంటే, నీలోనే ఏదో లోపముంది. అది తెలుసుకుని సరిదిద్దుకో!'' అన్నాడు.

తర్వాత విక్రమసేనుడు, మంత్రులందర్నీ పిలిచి, శచీంద్రుడి పితూరీ గురించి చెప్పి, ''మీలో ప్రతి ఒక్కరికీ ఏదో

"వసుంధర"



సమయాన ఇలాంటి భావం కలగవచ్చు. కానీ అధిక సంఖ్యాకుల అభిప్రాయానికి విలువనివ్వడంలోనే, మీ విలువ కూడా పెరుగుతుందని గుర్తుంచుకోండి.'' అన్నాడు.

రాజు వెళ్ళిపోయాక మంత్రులందరూ శచీంద్రుణ్ణి హేళనచేస్తూ, ''అందరితో కలిసేలా ఆలోచించడం నేర్చుకుంటే, నీ మాటకూ విలువుంటుందని, రాజుగారంటున్నారు. గుర్తుంచుకో!'' అన్నారు.

శచీంద్రుడు కోపంగా, ''చూస్తూండండి. మీ అందరితో కలవకపోయినా, రాజుగారు నా మాట వినేలా చేస్తాను,'' అన్నాడు.

ఆ తర్వాత ఒకసారి విక్రమసేనుడు వేటకు వెళ్ళివచ్చాడు. శచీంద్రుడు మంత్రులందర్నీ పిలిచి, ''మన రాజుగారు వేటలో అద్భుతమైన చాకచక్యం, సాహసం ప్రదర్శించివచ్చారు. ఆయనను మనమందరం ప్రత్యేకంగా వెళ్ళి అభినందించాలి!'' అన్నాడు.

ఇందుకు మిగతా మంత్రులెవ్వరూ అంగీకరించక, ''మన రాజుగారికిది అతి సామాన్య విషయం. ఏదైనా మహాకావ్యం రాసినా, యుద్ధంలో గొప్ప విజయం సాధించినా, రాక్షస సంహారం చేసినా, ఏదైనా మహాకార్యం తల పెట్టినా అభినందించాలి తప్ప, ఇంత చిన్న విషయానికి అభినందించబోవడం తగదు,'' అన్నారు.

అయితే చతురుడు మాత్రం, ''శచీంద్రుడు చెప్పింది సకారణంగానే వున్నది. మనం రాజుగారిని తగువిధంగా అభినందిద్దాం!'' అని తీర్మానించి, అందుకు ఏర్పాట్లు చేయమని శచీంద్రుడినే నియమించాడు.

ఇది విని శచీంద్రుడు మిగతా మంత్రుల వంక తిరస్కారంగా చూసి నవ్వి, అక్కణ్ణించి గర్వంగా తల పైకెత్తి వెళ్ళిపోయాడు.

ఈ జరిగినదానికి, మిగతా మంత్రులు చిన్నబుచ్చుకోవడం చూసి చతురుడు

వారితో, "వేటకు వెళ్ళి వచ్చిన రాజు గారిని ఇలా అభినందించడం అదీ నాకూ అవసరం అనిపించడం లేదు గానీ, మన శచీంద్రుడికి పితూరీలు చెప్పే అలవా టుంది. కారణమేదైనా తనను అభి నందిస్తానంటే వద్దనడం, రాజ్యమేలే ఏ రాజుకూ నచ్చదు. అందువల్ల ఆయన శచీంద్రుడి చెప్పుడుమాటలు వినడం ప్రారంభిస్తాడు. అది దేశానికి మంచిది కాదు. ఒకవేళ మీలో ఎవరైనా దీన్ని గురించి చెప్పివుంటే నేను తిరస్కరించే వాణ్ణి. శచీంద్రుడు చెప్పడంవల్ల వినక తప్పలేదు. కొన్నివిషయాలలో ఇదిసకారణ మవునా కాదా అనేగాక, దాని పరిణా మాలు కూడా ఆలోచించి జాగ్రత్తగా ప్రవర్తించాలి," అన్నాడు.

దీనికి మిగతా మంత్రులు సంతృప్తి చెందక, "అయితే, పితూరీలు చెబుతా డని భయపడి, వాడు చెప్పినవన్నీ చేస్తామా? ఇలా పితూరీలు చెప్పేవాణ్ణి మన మంత్రిమండలిలో వుంచడ మెందుకు? తొలగించి వేయవచ్చుగదా!" అన్నారు.

చతురుడు ఒకటి, రెండు క్షణాలు మౌనంగా ఆలోచిస్తూ వూరుకుని, తర్వాత మంత్రులతో, "లోకంలో వితండవాదం చేసే వాళ్ళకొరత ఏమీ లేదు. అయితే, ఒక్కొక్కసారి అలాంటివాళ్ళ వల్ల, వినేవాళ్ళకు పనికివచ్చే విశేషాలు బయట పడుతూంటాయి. శచీంద్రుడి సంగతే చూద్దాం. అతడు తెలివైనవాడు. మనందర్నీ కాదని తన మాట నెగ్గేలా చేస్తానని సాధించాడు. అతడిలోని ఆ తెలివిని మనం తెలివిగా ఉపయోగించుకోవాలి. మంత్రిమండలిలో ఇలా వితండవాదం చేసేవాడొకడెప్పుడూ వుండాలి. అతడి తెలివి మనకు ఉపయోగం. అతడి మూర్ఖత్వాన్ని మనం సంఖ్యాబలంతో ఓడిస్తాం!" అన్నాడు.

అప్పటికి మంత్రులందరూ తృప్తిపడి, చతురుడి తెలివిని ఎంతో మెచ్చు కున్నారు.





# మాటకారి

ఒకనాడు సూరయ్య అనే అతను, పక్క గ్రామంలో జరుగుతున్న సంతకు వెళ్ళాడు. సంతలో కొత్తగా గొడుగుల దుకాణం ఒకటి వెలిసింది. కొత్తగా, ఈ దుకాణం పెట్టింది ఎవరా అని, సూరయ్య పరీక్షగా చూశాడు. దుకాణంలో వీరయ్య కూర్చుని వున్నాడు. ఈ వీరయ్య, సూరయ్య గ్రామంవాడే, బాగా పరిచయస్థుడు కూడా.

వీరయ్య గ్రామంలో ఎవరికీ చెప్పాపెట్టకుండా, ఈ గొడుగుల వ్యాపారంలోకి ఎప్పుడు దిగాడా అని ఆశ్చర్యపోతూ, సూరయ్య అంత దూరంలో నిలబడి వీరయ్యను గమనించసాగాడు.

దుకాణం దగ్గిరకు ఒక బక్క పలచనివాడు వచ్చాడు. వీరయ్య అతడికి ఒక గొడుగును చూపుతూ, ''చూడు, బాబూ! నువ్వు చూడబోతే సన్నగా వున్నావు. నీకు చాలా తేలికైన గొడుగు అవసరం. నేనిచ్చిన గొడుగు చూడు. ఇది చాలా తేలిక. ఇది పుచ్చుకుని ఐదారుకోసులైనా చకచకా నడిచి వెళ్ళగలవు. అసలు గొడుగు పట్టుకున్నట్టే వుండదు,'' అన్నాడు.

ఆ బక్క పలచనివాడు గొడుగు విప్పి, పరీక్షగా చూసి తృప్తిపడి, దాని ఖరీదు ఇచ్చి వెళ్ళిపోయాడు.

ఇంతలో లావుపాటి ఆసామీ ఒకడు గొడుగు కొనడానికి వచ్చాడు. వీరయ్య అతడికి కూడా ఒక గొడుగు ఎంచి చూపుతూ, ''నీది కాస్త భారీ శరీరం, తేలికైన గొడుగులు, నీ చేతిలో ఇట్టే పాడైపోతాయి. అందుచేత కాస్త బరువుగా వుండేది ఇస్తున్నాను,'' అన్నాడు.

లావుపాటి ఆసామీ గొడుగును అటూ ఇటూ తిప్పి పరీక్షిస్తూండగా, వీరయ్య,

డా॥ బి. ఎస్. ఎస్. మూర్తి

''అన్ని వస్తువుల మాటేమోగాని—ముఖ్యంగా గొడుగనేది మాత్రం, మన శరీర ప్రమాణానికి తగినట్టుగా వుండాలి. ఈ గొడుగు చాలా గట్టిది. గాలివానలో అయినా, తుఫానులో అయినా వంగిపోదు, విరిగిపోదు!'' అన్నాడు.

ఆ మాటలతో ఆసామీ సంతృప్తి చెంది, దాని ఖరీదు ఇచ్చి వెళ్ళిపోయాడు.

ఇదంతా చూసిన సూరయ్య దుకాణం దగ్గిరకు వెళ్ళాడు. వీరయ్య అతణ్ణి చూస్తూనే, ''ఏం, సూరయ్యా, బాగున్నావా?'' అంటూ ఆహ్వానించి కూర్చొబెట్టాడు.

సూరయ్య చిన్నగా నవ్వుతూ, ''వీరయ్యా, నువ్వు సన్నటివాళ్ళకూ, లావుపాటివాళ్ళకూ చాలా తెలివిగా గొడుగులు అమ్మావు. చూడుమరి, నేను లావూ కాదూ, సన్నమూ కాదు. నాకొక గొడుగు అమ్మగలవా?'' అన్నాడు.

దానికి వీరయ్య, ''నీకు గొడుగు అమ్మడం కష్టమేం కాదు. వర్షాకాలం వచ్చేసింది. గొడుగు కొనుక్కోకపోతే, ఆరోగ్యం పాడు, పనులు చెరుపు. అందువల్ల, నువ్వు గొడుగెలాగైనా కొంటావు,'' అంటూ ఒక గొడుగు ఎంచి సూరయ్యకిస్తూ, ''ఇది నీకన్నివిధాలా సరిపోతుంది,'' అన్నాడు.

సూరయ్య గొడుగుకేసి కొంతసేపు పరీక్షగా చూసి, ''ఇది అంత బావున్నట్టు లేదే!'' అన్నాడు.



''అలా అనకు. నువ్వు దీన్ని అలా చేతిలో పట్టుకుని నిలబడితే, మన ఊళ్లో అందరినీ మించిన పెద్ద మనిషిలా కనిపిస్తావు. గొడుగును అలా విప్పివేసుకుంటే, నీ ముఖంలో జమీందారు కళ కనిపిస్తుంది. ఆ పళంగా గుర్రాన్నెక్కి స్వారీ ప్రారంభించావనుకో, సాక్షాత్తూ ఈ రాజ్యాన్నేలే రాజుగారిలాగే వుంటావు. ఈ సంగతి నీకు తెలియదు!'' అన్నాడు వీరయ్య.

సూరయ్య గొడుగు విప్పి పట్టుకుని, ''నువ్వు చెప్పే మాటలు నేను నమ్మను!'' అన్నాడు.

వీరయ్య ఒక అడుగు వెనక్కు వేసి, కొద్దిగా తల వంచి, ''నేను చెప్పినదాంట్లో అబద్ధం ఏమీ లేదు. ఈ గొడుగు వేసుకుంటే, మీ స్వరూపమే పూర్తిగా మారిపోయింది, సూరయ్యగారూ!'' అన్నాడు.

ఆ మాటలకు సూరయ్య ఆశ్చర్యపోతూ, ''ఇంతసేపూ నన్ను, నువ్వు అంటూ మాట్లాడినవాడివి, ఇప్పుడు మీరు అంటూ వల్లమాలిన గౌరవం ఇస్తున్నావేమిటి?'' అన్నాడు.

''ఈ గొడుగు వేసుకున్నాక మిమ్మల్ని, నువ్వు అనేందుకు ధైర్యం చాలడం లేదు!'' అన్నాడు వీరయ్య.

సూరయ్య అతడి తెలివికి సంతోషించి, గొడుగు ధర ఇచ్చి, ''మనలో మనమాట, వీరయ్యా! మనుషుల బక్క-బలుపూ, ఒడ్డూ-పొడుగుల్నిబట్టిఅమ్మేందుకు,అన్ని రకాల గొడుగులు నీ దగ్గిరున్నయ్యా?'' అని అడిగాడు.

అందుకు వీరయ్య పెద్దగా నవ్వి, ''నా దగ్గిరున్న గొడుగులన్నీ ఒకేరకం. కొనేవాళ్ళ రూపాన్నిబట్టి, చెప్పేమాటల్లో మార్పు చేస్తూంటాను. ఏం చేస్తాం! వాళ్ళవాళ్ళకు నచ్చేవిధంగా మాటలు చెబితేగాని కొనరు,'' అన్నాడు.

తమ ఊరువాడైన వీరయ్య తెలివి తేటలకు చాలా సంతోషిస్తూ, సూరయ్య కొత్త గొడుగుతో దుకాణం దగ్గిర నుంచి బయలుదేరాడు.





# పుల్లయ్య-ఎల్లయ్యల కథ

పుల్లయ్య అనే అతను గొప్ప దైవభక్తుడు. ప్రతిరోజూ దేవుడికి పూజ చేయందే పచ్చి మంచినీళ్ళు కూడా తాగడు. రాత్రి దేవుడికి నమస్కారం పెట్టుకున్న తర్వాతే నిద్రపోయేవాడు!

ఒక రోజు రాత్రి అతడికి కలలో దేవుడు కనిపించి, "ఒరేయ్, నీ భక్తికి మెచ్చాను. ఏం కావాలో కోరుకో?" అన్నాడు.

పుల్లయ్య వెంటనే, "స్వామీ! ఎదురింటి ఎల్లయ్య నాస్తికుడు. వాడిలో భక్తి భావం ప్రవేశపెట్టు. ఎదురింట్లో నాస్తికుణ్ణి పెట్టుకుని, నేను అసంతృప్తితో బాధపడుతున్నాను," అన్నాడు.

"రేపటినుంచి వాడిలో మార్పు తేవడం కోసం, నువ్వు చిన్న చిన్న మహిమలు చేయగలుగుతావు. నీకు వాక్శుద్ధినిస్తున్నాను. ఎల్లయ్యను భక్తుణ్ణి చెయ్యి." అన్నాడు దేవుడు.

పుల్లయ్య నిద్రలేచి కల గుర్తు చేసుకుని ఎంతో సంతోషపడ్డాడు. అతడు వీధిలోకి వెళ్ళి ఎల్లయ్యను పిలిచి, "దేవుడు నాకు కనిపించి నీకు బుద్ధి చెప్పమన్నాడు. ఈ రోజు నుంచి దైవపూజలు ప్రారంభించు. నాకు శిష్యుడివికా. అలా కాకుంటే నీ పెరట్లో వున్న కొబ్బరిచెట్టు బూడిదై పోతుంది," అన్నాడు.

"ఎలా అవుతుందో చూస్తాను. నేను దేవుడికి పూజ చెయ్యను," అన్నాడు ఎల్లయ్య.

ఇంతలో అతడి భార్య ఇంట్లో నుంచి బయటికి వచ్చి, పెరట్లో కొబ్బరిచెట్టు భగ్గునమండి బూడిదైపోయిందని చెప్పింది. పుల్లయ్య గర్వంగా మీసం మెలివేశాడు.

ఎల్లయ్య వెంటనే అక్కణ్ణించి, ఊరి చివర చింతచెట్టు దగ్గిరకు పరిగెత్తి, "చింతలదయ్యం, చింతలదయ్యం!

శ్రీరామ కమల్

నువ్వెన్నోసార్లు నాకు సాయపడతానంటే వద్దన్నాను. ఇప్పుడు నీ అవసరం వచ్చింది, రా!'' అన్నాడు.

''నాకు అపకారమే తప్ప, ఉపకారం చేయడం రాదు, తెలుసు గదా!'' అన్నది దయ్యం.

ఎల్లయ్య దానికి జరిగింది చెప్పాడు. దయ్యం జబ్బలు చరుచుకుంటూ, ''వెళ్ళి చూడు! ఆ పుల్లయ్య ఇల్లు ఒక మూల కూలిపోయి వుంటుంది,'' అన్నది.

దయ్యం చెప్పినట్టే జరిగింది. అప్పుడు పుల్లయ్య రెచ్చిపోయి, ఎల్లయ్య ఇల్లు కూలిపోయేలా చేశాడు. ఇందుకు ప్రతీకారంగా ఎల్లయ్య, పుల్లయ్య ఇల్లేకాక పంట పొలాలు కూడా నాశనం అయేలా చేశాడు.

ఆ రోజు పొద్దుపొడిచే సమయానికి, ఇద్దరూ సర్వనాశనమైపోయారు. అసరికి ఇద్దరికీ తామేం చేస్తున్నారో స్పృహకు వచ్చింది. పుల్లయ్య, ఎల్లయ్యను కలుసుకుని, ''నన్ను దెబ్బతీయడానికి దయ్యంతో సావాసం చేశావు. నీ సంగతి ఊళ్ళో అందరికీ చెప్పి, ఊరి నుంచి తరమగొట్టిస్తా!'' అన్నాడు.

ఇందుకు ఎల్లయ్య కోపంగా, ''మనం నమ్మినవాళ్ళ మధ్య పెద్ద తేడా నాకేం కనిపించడం లేదు. అయితే, దయ్యం సంగతి తెలిసి నేను దాని కెప్పుడూ దూరంగా వున్నాను. నువ్వు దేవుడి పేరు చెప్పి నన్ను సాధించపూనుకున్నాకే, నేను దయ్యం దగ్గరకు పరిగెత్తాల్సి వచ్చింది. అవునా?'' అని అడిగాడు.

పుల్లయ్య కొంచెంసేపు ఆలోచించి, ''అవును. ఎవరికీ అపకారం చెయ్యని నువ్వు, నాస్తికుడివైతే నాకేం లోటు వచ్చింది? నిన్ను మార్చాలనుకోవడం వల్లనే ఇన్ని ఇబ్బందులూనూ!'' అన్నాడు.

ఆ రాత్రి దేవుడు ఎల్లయ్యకు కలిగిన నష్టమంతా పూడ్చేశాడు. దయ్యాన్ని మందలిస్తే, అది పుల్లయ్య నష్టాన్ని పూడ్చేసింది. ఇక బుద్ధిగా వుండమని కలలో కనబడి హెచ్చరించి మాయమయ్యాడు దేవుడు.






రావణుడు అశోకవనంలో ఉన్న సీతను చూడబోయేసరికి, ఆమె భయంకర రాక్షసస్త్రీల నడుమ, తల వంచి కన్నీరు కార్చుతూ, రాముణ్ణి గురించే ఆలోచిస్తూ కూర్చుని ఉన్నది.

ఎంతో మంచి శుభవార్త తెచ్చిన వాడి లాగా అభినయిస్తూ, రావణుడు ఉత్సాహంగా సీతతో, "అయిపోయింది! నీ రాముడు యుద్ధంలో చచ్చిపోయాడు. ఇక నువ్వు నా భార్యవు కావటానికి ఎలాటి అడ్డంకీ లేదు. నా భార్యలందరి మీదా నిన్ను పెద్ద భార్యను చేస్తాను. రాముడు ఎలా చచ్చాడో చెబుతాను విను. రాముడు వానర సేనతో సముద్రాన్ని దాటి, విడిశాడు. ప్రయాణపు బడలిక చేత అందరూ గాఢ నిద్రలో ఉండగా, ప్రహస్తుడు పెద్ద రాక్షస సేనతో వెళ్ళి వానర సేనను నాశనం చేశాడు. రాముడు నిద్రపోతూండగా ప్రహస్తుడే అతని తలను నరికాడు. పారిపోదామని ఆకాశంలోకి ఎగిరిన విభీషణుణ్ణి రాక్షసులు పట్టుకున్నారు. లక్ష్మణుడూ, కొందరు వానరులూ పరిగెత్తారు. సుగ్రీవుడూ, హనుమంతుడూ, జాంబవంతుడూ, మిగిలిన వానర వీరులూ తలలు తెగి చచ్చి పడిఉన్నారు. వానరుల శవాలు అంతటా కుప్పలు కుప్పలుగా పడి ఉన్నాయి," అన్నాడు.

తరవాత అతను ఒక రాక్షసితో, "రాముడి తల తీసుకు వచ్చిన



విద్యుజ్జిహ్వుణ్ణి పిలుచుకురా!'' అని సీత వినేలాగా అన్నాడు.

విద్యుజ్జిహ్వుడు రాముడి తలనూ, విల్లునూ తీసుకు వచ్చి, రావణుడికి నమస్కరించి నిలబడ్డాడు. రావణుడు వాడితో, ''ఆ రాముడి తల సీత ముందు ఉంచు. ఈ నిర్భాగ్యురాలు తన భర్త గతి చివరకు ఎలాగయిందో చూసుకోనీ,'' అన్నాడు.

విద్యుజ్జిహ్వుడు రాముడి తలను సీత ముందు పెట్టి అవతలికి వెళ్ళాడు. అక్కడి నుంచి రావణుడు విల్లు తీసుకుని, సీతతో, ''ప్రహస్తుడు, నిద్రపోతున్న రాముడి తల నరికిన అనంతరం ఈ విల్లు ఇక్కడికి తెచ్చాడు. ఇక నీకు నేను తప్ప గతి లేదు,'' అన్నాడు.

సీత ఆ రాముడి తలను పరీక్షగా చూసి, కళ్ళూ, తలవెంట్రుకలూ, తల మీది చూడామణీ గుర్తుపట్టి గట్టిగా ఏడుస్తూ, కైకను తిట్టిపోసింది. తరవాత ఆమె స్పృహ తప్పి పడిపోయింది. తిరిగి స్పృహ రాగానే ఆమె రాముడి తల దగ్గరికి తీసుకుని, అతని కోసం చాలాసేపు ఏడ్చింది. రాముడి చావు గురించి కౌసల్య లక్ష్మణుడి ద్వారా విని, గుండె పగిలి చచ్చిపోతుంది. రాముడి వంశమంతా నాశనమైపోతుంది. ఇదంతా తన మూలాన జరుగుతుందని తెలియక రాముడు తనని పెళ్ళాడాడు.

ఆమె రావణుడితో, ''నన్ను తీసుకు పోయి ఆ రాముడి మీద పడవేసి, భార్యాభర్తలను ఏకం చేసిన పుణ్యం కట్టుకో. నేను రాముడితో సహగమనం చేస్తాను,'' అంటూ ఏడ్చింది.

ఆమె అలా ఏడుస్తూండగా ఒక రాక్షసుడు వచ్చి, రావణుడికి నమస్కరించి, సేనాపతి అయిన ప్రహస్తుడు వచ్చి ఉన్నాడని చెప్పాడు. అతని వెంట మంత్రులందరూ ఉన్నారట. ఆ మాట వింటూనే రావణుడు బయలుదేరి తన మంత్రులను చూడబోయాడు. అతను

అశోకవనం దాటగానే రాముడి తలా, విల్లూ అంతర్థానమయ్యాయి.

ఇంతలో విభీషణుడి భార్య అయిన సరమ సీత వద్దకు వచ్చింది. సరమ చాలా మంచిది. ఆమె సీత పట్ల చాలా స్నేహంగా ఉండేది. ఆమె సీతను ఊరడిస్తూ, "రావణుడి భయాన్ని కూడా లక్ష్యపెట్టకుండా చాటున ఉండి, నీకూ, రావణుడికీ జరిగిన సంభాషణ అంతా విన్నాను. రావణుడు అకస్మాత్తుగా ఎందుకు వెళ్ళాడో తెలుసా? ఆ భేరీల మోత విన్నావా? సైనికులను సన్నద్ధం చేస్తున్నారు. యుద్ధానికి ఏనుగులనూ, గుర్రాలనూ సిద్ధం చేస్తున్నారు. రావణుడు రాముడితో యుద్ధానికి తయారవుతున్నాడు. రామలక్ష్మణులు రాక్షసుల నందరినీ చంపి, నీ కష్టాలు గట్టెక్కిస్తారు," అన్నది.



ఈ మాటలకు సీత ఆవేదన కొంత చల్లబడింది.

సరమ సీతతో ఇంకా ఇలా చెప్పింది:

"నేను ఆకాశమార్గాన రాముడి వద్దకు వెళ్ళి, నువ్వు క్షేమంగా ఉన్నావని చెప్పి రావాలనుకుంటున్నాను. నేను ఆకాశంలో గరుత్మంతుడి కన్న వేగంగా పోగలను, తెలుసా?"

"నువ్వు ఆకాశంలో పోగలవన్నా, పాతాళానికిపోగలవన్నా నేనునమ్మగలను. నా కోరిక తీర్చదలుచుకుంటే ఇప్పుడు రావణుడు ఏం చేస్తున్నాడో తెలుసుకునిరా. నాకు రావణుడి భయమే హెచ్చుగా ఉన్నది. రావణుడుఏం చెయ్యబోతున్నాడో చెబితే నేను నీకు కృతజ్ఞురాలుగా ఉంటాను," అని సీత అన్నది.

సరమ సీత ముఖాన కన్నీరు తుడిచి, వెంటనే వెళ్ళి, రావణుడు తన మంత్రులతో మాట్లాడేదంతా విని, తిరిగి వచ్చి, సీతతో ఇలా చెప్పింది:

"నిన్ను వదిలిపెట్టమని రావణుడికి అతని తల్లీ, అవిద్ధుడనే ముసలి మంత్రీ ఎంతో దూరం బోధించారు. లేకపోతే అపాయం ఉన్నదని కూడా వాళ్ళు



గొప్పగా చెప్పారు, విన్నాను. ఇప్పుడు రాముడి పరాక్రమం తలచుకుని, నిరుత్సాహపడి, ఒకరి మొహాలు ఒకరు చూడటం కూడా కనిపిస్తూనే ఉన్నది,'' అన్నాడు.

ఈమాట విని మాల్యవంతుడనే రాక్షసుడు, ''రాజా, రాముడు మనకన్న బలవంతుడైనప్పుడు అతనితో సంధి చేసుకోవటం తప్పుకాదు. రాముడికీ, మనకూ వైరకారణం సీత. ఆమెను రాముడికి ఇచ్చేస్తే వైరంలేదు,'' అన్నాడు.

రావణుడికి కోతులవల్లా, కొండముచ్చులవల్లా, భల్లూకాలవల్లా చావు లేకుండా వరం లేదన్న సంగతి కూడా మాల్యవంతుడు జ్ఞాపకం చేశాడు.

మాల్యవంతుడి మాట రావణుడికి కొంచెం కూడా రుచించలేదు. అతను మాల్యవంతుడి కేసి తీక్షణంగా చూసి, ''హితం చెప్పుతున్నట్టు నటిస్తూ, కటువైన మోసపు మాటలు ఎందుకు చెప్పావు? రాముడు మామూలు మనిషి; ఒంటరిగాడు; తండ్రి చేత విడవబడిన వాడు; కోతులు సహాయంగా గలవాడు; అడవులు పట్టి తిరుగుతున్నవాడు. అలాటివాడు సమర్థుడని ఎలా చెప్పావు? సమస్త రాక్షసులకూ ప్రభువును; సమస్త దేవతలనూ హడలగొట్టిన పరాక్రమశాలిని,

హెచ్చరించారు. కాని వాళ్లు ఎంత చెప్పినా రావణుడు వినలేదు. యుద్ధంలో చచ్చేదాకా రావణుడు నిన్ను విడవడు. అతని మంత్రులు కూడా అతన్ని బలపరుస్తున్నారు.''

సరమ మాట్లాడుతూండగానే వానర సైన్యాలు చేసే భేరినాదాలూ, శంఖనాదాలూ, సింహనాదాలూ భూమి దద్దరిల్లేలాగా వినిపించాయి. రాముడు లంకానగరం మీదికి బయలుదేరాడు.

రావణుడు వానరసేనల కోలాహలం విని, సభలో తన మంత్రులతో, ''మీరు లోగడ హనుమంతుడు సముద్రాన్ని దాటటంగురించీ, రాముడి సేనను గురించీ

నేను అతనికి ఎందుకు తీసిపోయాను? నీ జాతిలోనే మహావీరుడు ఉండటం సహించలేకనే, లేక శత్రుపక్షపాతంతోనే నువ్వు అలా మాట్లాడి ఉంటావు గాని, మరో కారణం లేదు. నేను సీతను అరణ్యంనుంచి తెచ్చింది తిరిగి ఇచ్చెయ్యటానికా? నేను రాముడితో యుద్ధానికి భయపడటమా? రాముడు అంత బలవంతుడైతే నా తల తీయనీ, కాని తల వంచటం నా స్వభావం కాదు,'' అన్నాడు.



రావణుడికి కోపం వచ్చిందని గ్రహించి మాల్యవంతుడు మౌనం వహించాడు. అతను విజయం కలగాలని రావణుణ్ణి దీవించి వెళ్ళిపోయాక, రావణుడు మంత్రులతో రక్షణచర్యలు చర్చించాడు.

లంకా నగరపు పడమటి ద్వారాన ఇంద్రజిత్తూ, ఉత్తర ద్వారాన శుకసారణులూ, మధ్యలో విరూపాక్షుడూ రాక్షససైనికులతో సహా ఉండేటట్టు నిర్ణయించి, మంత్రులచేత ''జయ, జయ!'' అనిపించుకుని రావణుడు అంతఃపురానికి వెళ్ళాడు.

రాముడు వానర ప్రముఖులందరితో లంకానగరం చేరాక, వారిలో వారు ఇలా అనుకున్నారు:

''ఇదుగో, లంకానగరం. దీన్ని జయించటం దేవతలకు కూడా సాధ్యం కాదు. అందుచేత మనం ఇప్పుడు ఏం చెయ్యాలి?''

విభీషణుడు వారితో, ''నా మంత్రులు లంకకు పక్షుల రూపంలో వెళ్ళి అక్కడి ఏర్పాట్లన్నీ చూసి వచ్చారు. ప్రహస్తుడు సేనతో తూర్పుద్వారాన్నీ, మహోదర, మహాపార్శ్వులు దక్షిణ ద్వారాన్నీ కాస్తున్నారు. ఇంద్రజిత్తు పశ్చిమ ద్వారాన్నీ, విరూపాక్షుడు నగరమధ్యాన్నీ కాస్తున్నారు,'' అని చెప్పాడు.

అతని మంత్రులు కూడా రాముడికి తాము చూసి వచ్చిన వివరాలు చెప్పారు.

తరవాత రాముడికి హెచ్చరికగా ఉండగలందులకు విభీషణుడు, రావణుడి



యుద్ధమప్పుడు వానరులు మనుష్య రూపాలు ధరించరాదు. అలా అయితే గాని ఎవరు మనవాళ్ళో తెలియదు. రామలక్ష్మణులూ, హనుమంతుడూ, సుగ్రీవుడూ, నీలుడూ, అంగదుడూ, విభీషణుడూ మాత్రమే మనుష్యరూపాలతో యుద్ధం చేస్తారు.

ఇలా నిర్ణయించిన అనంతరం రాముడు లక్ష్మణుడితో సహా, మహా అందమైన సువేలపర్వతం ఎక్కాడు. అతని వెంట విభీషణుడు మొదలైన వాళ్ళు కూడా ఎక్కి, ఆ రాత్రి అక్కడ గడప నిశ్చయించారు. సువేలపర్వత శిఖరం మీది నుంచి చూస్తే, త్రికూట పర్వతం మీద నిర్మించిన లంకానగరం కనబడుతుంది. రాముడు మొదలైన వాళ్ళు లంకానగరాన్నేగాక, అందులో ఉన్న రాక్షసులను కూడా చూశారు. వానరులు సింహనాదాలు చేశారు.

ఇంతలో సూర్యుడు అస్తమించాడు. అందరూ ఆ రాత్రి సువేలపర్వత శిఖరం మీదనే గడిపారు. మర్నాడు తెల్లవారగానే వారికి లంకలోని వనాలూ, ఉపవనాలూ ఎంతో అందంగా కనిపించాయి. లంకకు అంతటికీ ఎత్తయినది రావణుడి ఇల్లు. దాని చుట్టూ ఎత్తయిన చైత్యప్రాసాదం ఉన్నది.

వెంట అతనితో సమాన బలపరాక్రమాలు గల రాక్షసులు అరవై లక్షల మంది ఉన్నారని చెప్పాడు. తన వీరులు ఎవరు ఎవరితో యుద్ధం చెయ్యాలో రాముడు చెప్పాడు.

నలుడు తూర్పుద్వారం వద్ద ఉన్న ప్రహస్తుడితోనూ, అంగదుడు దక్షిణ ద్వారం వద్ద ఉన్న మహాపార్శ్వ, మహోదరులతోనూ, హనుమంతుడు పడమటి ద్వారం దగ్గిరా, ఉత్తరద్వారం వద్ద ఉన్న రావణుడితో రాముడూ యుద్ధం చెయ్యాలి. అతని వెంట లక్ష్మణుడు కూడా ఉంటాడు. సుగ్రీవుడూ, జాంబవంతుడూ, విభీషణుడూ మధ్యసేనతో యుద్ధం చేస్తారు.

అంతలో సుగ్రీవుడికి రావణుడు కనిపించాడు. సుగ్రీవుడు అతనితో, "రావణుడా, నేను రాముడి స్నేహితుణ్ణి; బంటును. నేను నిన్ను విడిచిపెట్టను," అన్నాడు.

"నీ పేరు మంచికంఠం గలవాడు. కాని నీకు అసలు కంఠమే లేకుండా చేస్తాను," అంటూ రావణుడు సుగ్రీవుడి మీదికి లంఘించాడు. ఇద్దరూ భయంకరంగా పోట్లాడుకున్నారు.

చాలాసేపు ఇద్దరూ సమంగానే పోరాడారుగాని, క్రమంగా రావణుడికి ఆయాసం వచ్చి, అతను మాయలకు దిగాడు. అది గ్రహించి సుగ్రీవుడు చప్పున ఆకాశంలోకి ఎగిరాడు. అతను తిరిగి వస్తాడని రావణుడు అనుకున్నాడు గాని, సుగ్రీవుడు వెళ్ళి, రాముడి పక్కన వాలాడు.

రాముడు సుగ్రీవుణ్ణి మందలిస్తూ, "నాతో చెప్పకుండా ఎందుకిలా చేశావు? రాజులు సాహసాలు చెయ్యరాదు. నీకు ఏమయిపోతుందోనని మేమంతా భయపడ్డాం. నీకు అపాయం కలిగి ఉంటే మా గతి ఏమై ఉండేది? రావణుణ్ణి బంధువులతో సహా చంపి, విభీషణుడికి పట్టంగట్టి అయోధ్యకు తిరిగి పోవాలన్నది నా సంకల్పం," అన్నాడు.

"సీతను ఎత్తుకు పోయిన ఆ దుర్మార్గుడు కనబడితే ఎలా సహించి ఊరుకోను?" అన్నాడు సుగ్రీవుడు.

అందరూ పర్వతం దిగి వచ్చారు. రాముడు లంక మీదికి యుద్ధానికి పోవటానికి తొందరపడ్డాడు. అతని వెనకగా విభీషణుడూ, సుగ్రీవుడూ, హనుమంతుడూ, జాంబవంతుడూ, నలుడూ, సుసేణుడూ, నీలుడూ, లక్ష్మణుడూ నడిచారు. వారి వెనక మహాసముద్రం లాటి వానరసేన కదిలింది.

రామలక్ష్మణులు లంకానగరపు ఉత్తర ద్వారాన్ని ముట్టడించారు. దాన్ని రావణుడు స్వయంగా రక్షిస్తున్నాడు. అక్కడ అంతులేని రాక్షసఆయుధాలూ, కవచాలూ ఉన్నాయి.







# ఇంటిపెత్తనం

పూర్వం ఒక ఊళ్ళో దండపాణి అనే గృహస్థు ఒకడుండేవాడు. ఆయన భార్య పేరు భద్ర. వారికి నలుగురు కుమారులు. నలుగురికీ వివాహాలు జరిగి భార్యలు కాపరాలకు వచ్చారు.

భద్రమ్మ ఇంటి పెత్తనంలో చాలా సమర్థురాలు. ప్రతి విషయంలోనూ భర్తకు సహాయంగా ఉండేది. కాని తన తదనంతరం తన నలుగురు కోడళ్ళలో ఎవరు తన స్థానం ఆక్రమించగలుగుతారా అని ఆవిడకు బెంగపట్టుకుంది.

తన భార్యకుగల విచారం గ్రహించి దండపాణి నలుగురు కోడళ్ళనూ పరీక్షించదలుచుకున్నాడు. ఒకనాడు ఆయన ఒక్కొక్క కోడలినీ పిలిపించి, తలా అయిదు వడ్లగింజలూ ఇచ్చి, తాను తిరిగి అడిగేదాకా వాటిని భద్రపరిచి పెట్టమని హెచ్చరించాడు.

పెద్దకోడలు ఉజ్జిక ఈవిధంగా ఆలోచించింది: ఇంటి నిండా ఎప్పుడూ ధాన్యం ఉండనే ఉంటుంది. మామగారు ఏక్షణాన అయిదు వడ్లగింజలు తిరిగి ఇమ్మని అడిగినా గాదెలోనుంచి తీసుకుపోయి ఇవ్వవచ్చు. ఈ భాగ్యానికి ఈ వడ్లగింజలను భద్రపరిచేదేమిటి? ఇలా అనుకుని ఉజ్జిక మామగారిచ్చిన అయిదు వడ్లగింజలూ అవతల పారేసింది.

రెండో కోడలు భోగవతి కూడా ఉజ్జిక లాగే ఆలోచించింది. అయితే ఆమె వడ్లగింజలను అవతల పారెయ్యడానికి బదులు పొట్టు వొలిచి నోట్లో వేసుకుంది.

మూడవ కోడలు రక్షిక మామగారిచ్చిన వడ్లగింజలను భద్రంగా పొట్లం కట్టి తన పెట్టె అడుగున దాచింది.

నాలుగవ కోడలు రోహిణి ఈ విధంగా ఆలోచించింది: మామగారిచ్చిన ఈ గింజ



లను తిరిగి ఎప్పటికి అడుగుతారో తెలియదు. వడ్లగింజలు భద్రం చేసేది తినడానికి, లేదా నాటడానికి. ఈ అయిదు గింజలు తినడానికేమూల? అందు చేత వీటిని భద్రంచేయడమంటేతిరిగితరుణం వచ్చినప్పుడు నాటడమే. ఇలా అనుకుని రోహిణి తనకు మామగారిచ్చిన వడ్లగింజలను పుట్టింటికి పంపి పొలంలో నాటేయించింది.

రోహిణి పుట్టింటివారు అయిదు గింజలనూ నాటి, అయిదు వరి మొక్కలు పెంచారు. పంట వచ్చాక కోశారు. మరుసటేడు గింజలకోసం కబురు రాలేదు. అందుచేత పంట యావత్తూ విత్తనాలుగా ఉపయోగించి మరుసటేడూ పండించారు. ఈ విధంగా వరసన అయిదేళ్ళు గడిచాయి.

''ఏమండీ, నేను చూస్తే పెద్దదాన్నయిపోయాను. ఇక ఇంటి పెత్తనం నావల్ల కాదు. కోడళ్ళలో ఎవరికి పెత్తనం వప్పగించాలో తేల్చి చెబుతానన్నారు. ఐదేళ్ళు గడిచినై. ఇకనైనా ఏదో విధంగా నిర్ణయించండి,'' అన్నది భద్రమ్మ తన భర్తతో.

దండపాణి సరేనని, తాను దాచమని ఇచ్చిన అయిదేసి వడ్లగింజలనూ, తిరిగి తీసుకురమ్మని కోడళ్ళను అడిగాడు. పెద్ద కోడళ్ళు ఉజ్జికా, భోగవతీ కూడా గాదెలో నుంచి అయిదేసి వడ్లగింజలు తెచ్చి మామగారి ఎదట పెట్టారు. మూడవ కోడలు రక్షిక తన పెట్టె అడుగు నుంచి పొట్లం తీసి నల్లబడిపోయిన వడ్లగింజలను తెచ్చి మామగారి కిచ్చింది.

దండపాణి వాటిని చూసి, ''ఇవి నిజంగా నే నిచ్చినవే!'' అన్నాడు. ఉజ్జికా, భోగవతీ తెచ్చిన గింజలు కొత్త పంటవి గనుక బంగారం రంగులో ఉన్నాయి.

''ఇవి నే నిచ్చిన గింజలు కావు. ఏం జరిగింది? నిజం చెప్పెయ్యండి!'' అని దండపాణి పెద్దకోడళ్ళ నడిగాడు.

వారు గత్యంతరం లేక చేసిన పని చెప్పివేశారు.

దండపాణి చిన్న కోడలు రోహిణితో, "ఏవమ్మా నేను నిన్ను దాచమని ఇచ్చిన గింజలూ ?" అన్నాడు.

"వాటిని నేను మా పుట్టింటికి పంపాను. రావడానికి కొంత వ్యవధి కావాలి. రెండు రోజులు గడువివ్వండి." అన్నది రోహిణి.

సరేనన్నాడు దండపాణి. రెండు రోజుల కల్లా రోహిణి పుట్టింటివారి ఊరు నుంచి యాభై బళ్ళ మీద ధాన్యపు బస్తాలు దిగాయి. వాటిని చూసి అందరూ నివ్వెర పోయారు. అయిదేళ్ళ క్రితం అయిదు గింజలను సరిగా భద్రం చేయడంవల్ల ఈ రోజు యాభై బళ్ళ ధాన్యం తయారయింది.

"చూశావా ? ఇంటిపెత్తనం నీ ఆఖరు కోడలు రోహిణి కివ్వు. ఏది ఎలా భద్రం చేయాలో ఆమెకు తెలుసు," అన్నాడు దండపాణి తన భార్యతో.

"మిగిలిన ముగ్గురి మాట ఏమిటి? వారికి కూడా ఏదైనా పని చూపించ వద్దా ?" అన్నది భద్రమ్మ.

"ఉజ్జిక పనికిమాలిన వస్తువులు పారబోసే మనిషి. చెత్తా చెదారమూ ఊడ్చి ఇల్లు శుభ్రంగా ఉంచే పని ఆమె కివ్వు. భోగవతి ది చేతికి దొరికిన వస్తువును అనుభవించే గుణం. ఆమెకు వంటయింటి పెత్తనం ఇవ్వటం మంచిది. రక్షిక ప్రతి వస్తువునూ జాగ్రత్తగా రక్షించగలదు. కొట్టు పెత్తనం ఆమె చక్కగా నిర్వహిస్తుంది. ఈ విధంగా పనులు విభజించి నట్లయితే సంసారం సుఖంగా సాగిపోతుంది," అన్నాడు దండపాణి.

భద్రమ్మకు ఈ ఏర్పాటు బావుందనిపించింది. ఆ విధంగానే కోడళ్ళకు పనులు విభజించింది. తాను ఇంటి పెత్తనం నుంచి విరమించి, హాయిగా "కృష్ణా, రామా !" అనుకొంటూ చీకూ చింతా లేకుండా మిగిలిన తన జీవిత కాలాన్ని సుఖంగా వెళ్ళబుచ్చింది.





# స్నేహితులబెడద

రామాపురం జమీందారు మానవేంద్రుడికి, చాలామంది స్నేహితులు ఉండేవారు. వాళ్ళందరూ ఒక వేళాపాళాలేకుండా ఆయనచుట్టూ చేరి, ఊకదంపుకబుర్లు చెబుతూ విసిగిస్తూండేవారు. వాళ్ళధోరణి చిరాకు కలిగిస్తున్నా, చెబితే నొచ్చుకుంటారేమోనని జమీందారు సహిస్తూ వస్తున్నాడు.

రానురాను జమీందారు సహనం సన్నగిల్లుతున్నది. ఒకనాడాయన దివాను దివాకరుణ్ణి పిలిచి, సమస్య వివరించి, పరిష్కారమేదైనాచూడమన్నాడు. దివాను సరేనన్నాడు.

ఆ మర్నాడు మానవేంద్రుడు యథాప్రకారం స్నేహితులమధ్య వుండగా మల్లు పంచె, తెల్లటిలాల్చీ, ధరించిన ఒక పెద్దమనిషి, దర్బారు మంటపంలో ప్రవేశించాడు. అతడు రావడాన్ని దూరం నుంచే చూసిన జమీందారు లేచి, అతడికి ఎదురు వెళ్ళి, కరచాలనం చేస్తూ, భుజం మీద చెయ్యివేసి తీసుకువచ్చాడు.

జమీందారు మిగతా స్నేహితులు ఇదంతా ఆశ్చర్యపోతూ చూడసాగారు. ఆ వచ్చిన పెద్దమనిషి వాళ్ళ మధ్యనే కాస్సేపు కూర్చుని, క్లుప్తంగా నాలుగు ముక్కలేవో జమీందారుతో మాట్లాడి, "వెళ్ళి వస్తాను. సెలవిప్పించండి." అని లేచి నిలుచున్నాడు.

జమీందారు కూడా లేచి, సింహద్వారం దాకా అతణ్ణి సాగనంపడానికి బయలుదేరాడు.

ఆ పెద్దమనిషి వెంట జమీందారు నెమ్మదిగా నడుస్తూంటే, మిగతా స్నేహితులంతా అసూయతో, "అతగాడెవరో కాని, జమీందారు ఎదురేగి ఆహ్వానించడం, ఇప్పుడు వెంట వెళ్ళి వీడ్కోలివ్వడం

జొన్నలగడ్డ రత్న

వింత అనిపిస్తున్నది. ఇలాంటి స్వాగతం ఇన్నేళ్ళుగా ఆయనతో స్నేహం చేస్తున్న మనలో ఏ ఒక్కరికైనా లభించిందా? దీనినిబట్టి చూస్తూంటే, మనకన్నా ముఖ్య స్నేహితులు ఆయనకున్నారని తెలి పోతున్నది," అంటూ గుసగుసలు ప్రారంభించారు.

వాళ్ళ మాటలు చెవినపడ్డ దివాను, "మీకే కాదు, నాకూ జమీందారుగారి ప్రవర్తన ఆశ్చర్యం కలిగిస్తున్నది! ఈ వచ్చిన పెద్దమనిషి అమలేందుడనే ఆయనేమో అన్న అనుమానం కలుగు తున్నది. జమీందారుగారికి పట్నంలో, ఆ పేరుగల స్నేహితుడొకాయన వున్నాడు. ఆయన్ని గురించి జమీందారుగారు, నాతో అప్పుడప్పుడూ ఏదో చెబుతూండేవారు," అన్నాడు.

దివాను ఇలా అనగానే, జమీందారు స్నేహితులంతా, "ఏమిటీ, అమలేందుడా? ఆయన పేరు మేమేనాడూ వినలేదే! సరే, ఇంతకూ ఆయన్ని గురించి జమీం దారుగారేమనేవారు?" అని అడిగారు ఏక కంఠంతో.

అందుకు దివాను, "ఒకరు, ఇంకొకరి ఇంటికి ఏ సందర్భంలో వెళ్ళినా, అక్కడ ఎంతసేపు వుండాలి అన్నదానికన్న, అక్కడి నుంచి ఎప్పుడు సెలవు తీసుకుని బయలుదేరాలి, అన్నది తెలిసివుండడం చాలా ముఖ్యం. పట్నంలో వుండే నా స్నేహితుడు అమలేందుడు, ఈ విష



యానికి చాలా ప్రాధాన్యత ఇస్తాడు— అని అప్పుడప్పుడు అంటూ వుంటారు,'' అన్నాడు.

దివాను దివాకరుడి మాటలు విన్న జమీందారు స్నేహితులకు, కొత్తగా వచ్చిన ఆ పెద్దమనిషికి, జమీందారు నుంచి అలాంటి స్వాగతం ఎందుకు లభించిందో అర్థమయింది. వాళ్ళు అక్కడి నుంచి వెంటనే లేచి సింహ ద్వారం కేసి బయలుదేరారు.

కొత్త స్నేహితుణ్ణి సాగనంపి తిరిగి వస్తున్న జమీందారు, తన పాత స్నేహితు లంతా ఏకంగా సింహద్వారం కేసి పోతూం డడం గమనించి, చిరునవ్వుతో, ''ఏమిటీ విశేషం! అందరూ వెళ్ళిపోతున్నారేం?'' అని అడిగాడు.

అందుకు స్నేహితులందరూ, ఏం జవాబు చెప్పాలో వెంటనే తోచక ఒక క్షణం ఆగి, ''మరేంలేదు. మన రాయణం గారు చాలా ముఖ్యమైన పని మీద పట్నం వెళుతున్నారు. ఆయన బయలుదేరే లోపల, ఆయన్ను కలుసుకుని ఒక సంగతి చెప్పాలి. ఆ విషయం మరిచి చాలాసేపు ఇక్కడే వుండిపోయాం. మళ్ళీ కలుసుకుంటాం,'' అంటూ వెళ్ళి పోయారు.

జమీందారు చిన్నగా నవ్వుకుని దివానుతో, ''మంచి పని చేశారు! మీరు గమనించే వుంటారు—డబ్బూ, అధికారం వున్న ప్రతివాళ్ళచుట్టూ, ఎందరో చేరి స్నేహితులుగా చెలామణీ అవుతూ, వాళ్ళ నుంచి ఏదో లాభం పొందేందుకు ప్రయత్నిస్తూంటారు. శత్రువులను ఎదుర్కోవడంకన్న, ఇలాంటి వాళ్ళతో కూడిన వ్యవహారమే, చాలా శ్రమకూ, కష్టానికీ కారణమవుతుంది. మీరాడించిన నాటకంవల్ల, సమయం, సందర్భం తెలుసుకోకుండా ప్రవర్తించే, స్నేహితుల బెడద కాస్త తప్పేలా వుంది. చక్కగా నటించిన ఆ అమలేందుడి పాత్రధారికి, ఏదైనా మంచి బహుమానం ఇద్దాం,'' అన్నాడు.





# వేపచెట్టు మహిమ

పూర్వం మలయాళ దేశంలో ఒక జామొరిన్ ధనాశచేత తన రాజ్యమంతటా చింతచెట్లు నాటించటానికీ, చింతతోపులు వేయించటానికీ నిశ్చయించి, ఆ పనికి తన మంత్రిని నియోగించాడు.

ఆ రాజ్యంలో నంబియారనే గొప్ప వైద్యుడుండేవాడు. మూలికా వైద్యంలో నంబియారుకు యావద్భారత ఖ్యాతి ఉండేది. ఆ కాలంలో ఢిల్లీపాదుషా దగ్గిర వుండే అరబ్బీ హకీమ్ ప్రకృతి వైద్యంలో అద్భుత ప్రజ్ఞగలవాడు. నంబియారు కూడా దాదాపు అయనతో సమానమైన వైద్యుడని ప్రజలు ఎంతో గొప్పగా చెప్పుకునేవారు.

జామొరిన్ దేశమంతటా చింతచెట్లు నాటిస్తున్నాడని తెలియగానే నంబియారు అయన దగ్గిరికి వెళ్ళి, "చింతచెట్లు అనారోగ్యకరమైనవి. వాటి బదులు వేపచెట్లు వేయించండి. ప్రజలు ఆరోగ్యవంతులుగా ఉంటారు. అంటువ్యాధులు చేరవు," అన్నాడు.

జామొరిన్ వినిపించుకోలేదు.

"చింతచెట్లవల్ల అనేక ఉపయోగాలున్నాయి. చింతపండుకు మంచి గిరాకీ వున్నది. చింతకట్టెతో చేసిన బొగ్గులు శ్రేష్ఠమైనవి. చింతపుల్లలతో పళ్ళు తోముకోవచ్చు. చింతచిగురూ, చింతపూవూ ఎంతో రుచిగా వుంటాయి. దారులవెంబడి చింత మొక్కలు నాటి విడిచినట్టయితే, ఎవరూ పోషణ చేయకుండానే అవి బ్రహ్మాండమైన చెట్లుగా పెరిగి ప్రయాణీకులకు చల్లని నీడనిస్తాయి. వేపచెట్లవల్ల ఒక్క ప్రయోజనమూ లేదు," అన్నాడు జామొరిన్.

నంబియారు ప్రభువుకు మారు చెప్పలేక శలవు తీసుకుని నేరుగా మంత్రి

మలయాళ జానపదకథ



ఇంటికి వెళ్ళాడు. మంత్రి ఆయనకు గౌర వంగా స్వాగతమిచ్చి కుశలప్రశ్నలు వేశాడు. నంబియారు మంత్రి ముఖంలో ఏదో గమనించినవాడి లాగా నటిస్తూ, ఆయన కనురెప్పలకిందా, నోటిలోనూ చూసి, నాడి పరీక్షించసాగాడు.

మంత్రి నవ్వుతూ, "ఎందుకిలా పరీ క్షిస్తున్నారు ? మీ దయవల్ల నా ఆరోగ్యానికి లోపమేమీ లేదు," అన్నాడు.

నంబియారు గంభీరంగా, "ఇప్పుడేమీ లోపం లేదు. కాని ఆరు మాసాలలో మీకు భయంకరమైన జబ్బు చేయబోతున్నది. సకాలంలో దానికి తగిన చికిత్స జరగటం మంచిది," అన్నాడు.

మంత్రి కంగారుపడి, "అయితే, ఆలస్యం దేనికి ? తక్షణం వైద్యం ప్రారం భించండి," అని అడిగాడు.

"ఈ వ్యాధి నా వైద్యానికి లొంగేది కాదు. మీరు వెంటనే బయలుదేరి ఢిల్లీలో పాదుషాగారివద్ద ఉండే హకీమ్‌ను చూడటం మంచిది," అన్నాడు నంబియారు.

"అంతదూరం ఏదో విధంగా కష్టపడి వెళ్ళితే మాత్రం ఆయన నన్ను సరిగా చూస్తారా ?" అన్నాడు మంత్రి.

"హకీమ్‌గారికి అటువంటి తేడాలేమీ లేవు. ఆయన కడుబీదవారికి కూడా ఆద రంతో చికిత్స చేస్తాడు. మీరు వెంటనే బయలుదేరటం అన్ని విధాలా మంచిది," అన్నాడు నంబియారు.

వ్యాధి విషయంలో నంబియారు చెప్పిన దానికి తిరుగులేదు గనక, మంత్రి ఒక సంవత్సరం శలవు తీసుకుని ఢిల్లీకి ప్రయాణం కట్టాడు. ఆయన బయలుదేరే టప్పుడు నంబియారు ఒక సలహా ఇచ్చాడు :

"దారిలో చింతచెట్ల నీడనే విశ్ర మించండి. చింతలతోపుల్లోనే మకాం చెయ్యండి. చింతపుల్లలతోనే పళ్ళు తోముకుని ముఖం కడుక్కోండి. వంట వగైరాలు చింతకట్టెలతోనే చేయించు కోండి."

మంత్రి నంబియారు ఇచ్చిన సలహాను అక్షరాలా పాటిస్తూ సపరివారంగా ఢిల్లీకి ప్రయాణమయ్యాడు. ఇంకా ఢిల్లీ చేరక మునుపే ఆయన ఆరోగ్యం చెడనారంభించింది. బలహీనత ఏర్పడింది. శరీరం చిక్కి పాలిపోసాగింది.

''ఆహా! నంబియారెంత తెలివిగల వైద్యుడు! ఈనాడు వచ్చిన రోగాన్ని ఆయన ఆనాడే పట్టగలిగారు,'' అనుకుంటూ మంత్రి అతి బలహీన స్థితిలో ఢిల్లీ చేరాడు.

ఆయనకు హకీమ్‌గారి దర్శనం చాలా సులువుగా లభించింది. మంత్రి చెప్పినదంతా విని, నంబియార్ ఈ మంత్రిని, చింతచెట్లవల్ల కలిగే అపాయం ఎలాంటిదో రుజువు చేయటానికే తనవద్దకు పంపి వుంటాడని ఊహించాడు.

''మీ వ్యాధి గొప్పదేగాని, దాని చికిత్స మాత్రం చాలా సులువైనది,'' అన్నాడు హకీమ్.

''అదేదో చెప్పండి. మీకు యావజ్జీవం రుణపడి వుంటాను,'' అన్నాడు మంత్రి.

''మీరు వెంటనే బయలుదేరి మీ దేశానికి వెళ్ళిపొండి. వెళ్ళేటప్పుడు వేపచెట్ల నీడలోనే విశ్రమించండి. వేపతోపులలోనే మకాం చెయ్యండి. గాలి చాలనప్పుడు వేపమండలతో విసురుకోండి. వేపచెట్ల గాలి తగిలేచోట నిద్రపొండి. వేపపుల్లతోనే పళ్ళుతోముకుని ముఖం కడుక్కోండి. ఇంతకంటె మీ వ్యాధికి మరొక చికిత్స



అవసరం లేదు. నంబియారుగారికి నా తరఫున వెయ్యి సలాములు చెప్పండి. వెళ్ళిరండి,'' అన్నాడు హకీమ్, మంత్రితో.

ఇదే సలహా మరొక వైద్యుడెవడైనా ఇచ్చి ఉంటే మంత్రికి గురి ఉండక పోను. హకీమ్ చెప్పాడు గనక పూర్తిగా విశ్వసించి, మంత్రి సపరివారంగా స్వదేశానికి ప్రయాణమయ్యాడు. హకీమ్ చెప్పిన ప్రకారమే ఆయన వేపచెట్ల నీడల విశ్రమిస్తూ, వేపచెట్ల గాలి అనుభవిస్తూ దారిలోనే తన ఆరోగ్యాన్ని తిరిగి సంపాదించగలిగాడు. స్వదేశానికి చేరేసరికి పూర్వం కన్న రెట్టింపు బలమూ, ముఖ కళా ఆయనలో కనబడింది.

మంత్రి ఇల్లు చేరగానే నంబియారు ఆయనను చూడవచ్చాడు. మంత్రి తన అనుభవాలన్నీ నంబియారుకు వివరంగా చెప్పాడు.

''మనం ఒకసారి జామొరిన్‌గారివద్దకు వెళదాం. మీ అనుభవాలను గురించి ఆయన స్వయంగా వినటం చాలా ముఖ్యం!'' అన్నాడు నంబియారు.

ఇద్దరూ కలిసి జామొరిన్ దగ్గరికి వెళ్ళారు. జామొరిన్ మంత్రి అనుభవాలు విని చాలా ఆశ్చర్యపోయాడు.

''ఇందులో నా తప్పు చాలా ఉన్నందుకు మీరిద్దరూ నన్ను మన్నించాలి. మంత్రిగారికి ఏ జబ్బూ లేకుండానే, నేనాయనను ఢిల్లీ ప్రయాణం కట్టించాను. చింతచెట్ల వల్ల కలిగే హాని ఏలినవారికి నిరూపించటమే నా ఉద్దేశం. ఆ తరవాత వేపచెట్ల మహిమను హకీమ్‌గారు నేను చెప్పకుండానే నిరూపించారు. ఇప్పటికైనా ప్రజల మేలుకోరి మీరు చింతచెట్లు నాటించటం మాని వేపచెట్లు నాటించండి. అవకాశం వున్న ప్రతిచోటా వేపతోపులు వేయించటం మంచిది,'' అన్నాడు నంబియారు.

జామొరిన్ మారుమాట చెప్పకుండా, తన రాజ్యమంతటా వీలయినన్ని వేపచెట్లు నాటించి వనమహోత్సవం జరిపించవలసిందిగా ఉత్తరువు చేశాడు.



## మనిషి-ముఖం పాము!

తమిళనాడు కుంభకోణం సమీపంలో 'వలంగైమాన్' అనే ఊళ్ళో నాలుగునెలల క్రితం, మనిషి ముఖంతో ఒక త్రాచుపాము కనిపించింది. పడగ మీద మనిషికి లాగే కళ్ళూ, కనుబొమలూ, ముక్కూ, నోరూ తీర్చిదిద్దినట్టున్న ఆ పామును చూసి అందరూ అమితాశ్చర్యం చెందారు.





## పొట్టి నీటిఏనుగులు

నీటి ఏనుగులలోనూ 'వామనజాతి జంతువు లున్నాయి. ఆఫ్రికాలోని, నైజీరియా పల్లపు అడవులలో నివసించే ఈ పొట్టి నీటి ఏనుగుల సంఖ్య రోజు రోజుకూ తగ్గిపోతున్నాయి. వీటి ఎత్తు 75 సెం.మీ. (మామూలు నీటి ఏనుగులు సుమారు 150 సెం.మీ. ఎత్తు వుంటాయి.) 2.5 మీటర్ల పొడవు ఉంటాయి. మామూలు నీటి ఏనుగులు రాత్రిపూట గడ్డి మైదానాలలో తిరిగి, పగటిపూట నీళ్ళలో గడుపుతాయి. అయితే, ఈ 'వామనజలగజాలు' పగటిపూట మైదానాలలో తిరుగుతూ, దుంపలనూ, గడ్డినీ, పళ్ళనూ తింటూ రాత్రులు నీళ్ళలో గడుపుతాయి.

## బస్టర్డ్ పక్షి

మన దేశంలోని చాలా అరుదైన బస్టర్డ్ (బట్ట మేక) పక్షి సంతతి నశించి పోయిందనుకున్నారు. ఈ వింతపక్షి కొన్ని సంవత్సరాల తరవాత ఇప్పుడు కర్నూలు అడవి ప్రాంతాలలో కనిపించడం పక్షుల అభిమానులకు ఎంతైనా ఆనందకరమైన విషయం. ఇవి ఒకప్పుడు రాజస్థాన్, గుజరాత్, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్ ప్రాంతాలలో నివసించేవి. ఈ జాతిపక్షులు దాదాపు నలభై వరకు రాయలసీమ అడవి ప్రాంతాలలో కనిపించాయి. ఒక మీటరు ఎత్తు పెరిగే ఈ పక్షులు మిడతల్నీ, తొండల్నీ, పురుగుల్నీ పట్టితింటాయి.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1992 మే నెల సంచికలో ప్రకటింపబడును.



T. C. Jain



S. B. Prasad

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ మార్చి నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: కాదు వృద్ధాప్యం పనికి హద్దు! రెండవ ఫోటో: లేదు చెలిమికి సరిహద్దు!

పంపినవారు: పెరవలి సుధాకర్ శ్రీవాత్సవ, C/o పి. నరసింహమూర్తి,
కొత్తకోట, మహబూబ్‌నగర్ జిల్లా (ఆం. ప్ర)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 48-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

**Statement about ownership of CHANDAMAMA (Telugu)**
**Rule 8 (Form VI), Newspapers (Central) Rules, 1956**

| | |
|---|---|
| *1. Place of Publication* | 'CHANDAMAMA BUILDINGS'<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| *2. Periodicity of Publication* | MONTHLY<br>Ist of each calender month |
| *3. Printer's Name* | B.V. REDDI |
| *Nationality* | INDIAN |
| *Address* | Prasad Process Private Limited<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| *4. Publisher's Name* | B.VISWANATHA REDDI |
| *Nationality* | INDIAN |
| *Address* | Chandamama Publications<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| *5. Editor's Name* | B.NAGI REDDI |
| *Nationality* | INDIAN |
| *Address* | 'Chandamama Buildings'<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |
| *6. Name and Address of individuals who own the paper* | CHANDAMAMA PUBLICATIONS<br>PARTNERS:<br>1. Sri B. VENKATRAMA REDDY<br>2. Sri B.V. NARESH REDDY<br>3. Sri B.V. SANJAY REDDY<br>4. Sri B.V. SHARATH REDDY<br>5. Smt. B. PADMAVATHI<br>6. Sri B.N. RAJESH REDDY<br>7. Smt. B. VASUNDHARA<br>8. Kum. B.L. ARCHANA<br>9. Kum. B.L. ARADHANA(Minor)<br>(Minor admitted to the benefits of Partnership)<br><br>'Chandamama Buildings'<br>188, N.S.K. Salai<br>Vadapalani, Madras-600 026 |

I, B Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**B. VISWANATHA REDDI**
*Signature of the Publisher*

*2nd March 1992*